# ఉపోద్ఘాతము.



ఈకల్పితప్రబంధము పుచ్చా సీతారామయ్యగారి కంకితమీయఁబడినది. ఇది యధికప్రయత్నముచేఁ గను బలవంతపెట్టి యతఁడే రచియింపఁజేసినాఁడు. తుదకు జరుగకపోయినను మాకాయన చేయఁదలంచుకొన్న బహుమానము వేయిన్నినూటపదార్లు. ప్రకృతము కృతినేత మృతిఁజెందినను దీనినిరచించి వినిపించినపిదప నాలుగుసంవత్సరములవఱకును చక్కగాజీవించియుండి మొదటఁ బ్రతిశ్రుతమైనర్పినధనము నీఁజాలక యేదోమిషవెట్టి నానాఁటికి మాకు విసువుపుట్టించి "ఇఁకనితఁడు సమ్మానించినను స్వీకరింపఁగూడ" దనునభిప్రాయమును బూర్తిగాఁగలిగించి యట్టి యుత్తరముగూడ మావలననందుకొనెను. ప్రప్రథమము చిత్తుకాగితములమీఁదనే పుస్తకమును బూర్తిగావిని పరమానందమునంది వెంటనే యచ్చొత్తింప నెంతోయత్నమొనర్చి "సమ్మానానంతరమునఁ గాని ముద్రణమునకు వలనుగా" దని మేమడ్డుపెట్టుటచే నించుకయాగ్రహించి పైమొత్తమునకు నోటొకటి వ్రాసియుంపెను. వెంటనే దానిపై వసూలుపెట్టి తిరుగఁగొట్టితిమి. పదపడి కొన్నాళ్ళు బందరుపురమ్ముననే యుండెనుగాని ధనలోపముచే సమ్మానముమాత్రము జరిగింపఁజాలఁడయ్యె. అనంతరము తన యగ్రహారగ్రామమగు సిరిపురమునకు వాసముమార్చికొని యటనుండి యుత్తరముల మూలమున సమ్మానించు నభిప్రాయమును వెలిపుచ్చుఁజొచ్చెనుగాని దైవ మనుకూలింపమిచేఁ గృతార్థుఁడుమాత్రము కానేరఁడయ్యె, తక్కినవిషయములెట్లున్నను నితఁడు ధనవ్యయమునకు మాత్రమించుకయు వెనుదీయువాఁడుకాఁడు. దాతృత్వముతోపాటుగా నవ్యవస్థిత చిత్తత్వమీతనికి సహజగుణము. "అవ్యవస్థిత చిత్తస్యప్రసా

దోషి భయంకరః" అనికదా? పెద్దలు చెప్పుదురు. కావున నిట్టివానికంకిత ముగాఁ గృతి చెప్పుట మాలోపమే యని మేము వ్రాయకున్నను లోకము నిశ్చయించుకొనక యెట్లు మానును ? ఇతఁడంతలో దైవవశమున మృతిఁ జెందెను గాని జీవించియున్నను సమ్మానము చేయఁజాలఁడనియే మా నమ్మకము. సమ్మానము కేమి ? అతఁడెట్టివాఁడైనను "యశము కొఱకుఁగదా? అతిప్రయత్నమునఁ గృతి చెప్పించుకొనుట" యనియూహించి "మరణాంతాని వైరాణి" యనుమాట స్మరించి యీ మా కన్యక నతని పేరుమీఁదనే ప్రకటించితిమి. ఏతంతూద్వాహామంతగాఁ దప్పులేనియిక్కాలమున నీకన్యకకు బాల్యవైధవ్య మనుభవింపవలసినంత నిర్బంధనము లేశమును లేదు గాని యేమైనను నన్యథాకరించుటకు మనసొప్పినది కాదు. దీనిని సహగమనము చేయించవలెనను నూహ గూడ నుదయించినది కాని, యదియిప్పటి శాసనమునకు విరుద్ధమని తిరిగి యణాగిపోయినది. పదపడి యీ విశ్వస్తకు భరణప్రాప్తి కలుగునను కింవదంతి కలిగినది. "కాకమాంసం శునోచ్ఛిష్టం స్వల్పం తదపి దుర్లభం" అనురీతి నున్న యీ భరణమునందును మా కృతికన్యకిష్టము లేదు.... గుణదోషములు రసజ్ఞలోకమే నిర్ణయింపఁగలదుగదా ? యని..... ...........యింతతో నీయంశమును ముగించుచున్నాము.

తిరుపతి వేంకటేశ్వరులు.

# ద్వితీయ ముద్రణపీఠిక.



చదువరులారా ?

ఈ కబ్బమునుగూర్చి వ్రాయఁదగు నంశములన్నియు మొదటి పీఠికయందే వ్రాయఁబడియుండుటచే నిపుడు నూతనముగా 'నిందు వ్రాయఁదగు నంశము లెవ్వియును లేవు. కాని ముద్రాయంత్రయునం దలి యక్షరములు బొత్తిగా నలిగియుంటచేఁ బ్రతిపుటయందును నెన్నియో యంటనిచోట్లు కలవు. అందు "ం, న, వ, మ, గ, వి, ఈయక్క రములు చాలభాగ మంటనేలేదు. మఱికొన్ని యక్షరములుకూడ నంటనివికలవుగాని వీనివలె బొత్తిగానంటకపోలేదు. ఇఁక ప్రూఫుచూ చువారి ప్రమాదముచలనఁ గలిగిన లోపములుమాత్రమిా క్రిందఁ జూపి విరమించుచున్నాఁడను.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 2 | కఁట | కట |
| 6 | 4 | నేమమూ | నేమమో |
| 6 | 20 | భంబు | భంపు |
| 8 | 12 | స్లేక | న్లేక |
| 8 | 23 | గుఱ్ఱు | గుర్తు |
| 8 | 24 | జాతి | జాతికి |
| 14 | 18 | లోగ | లోఁగ |
| 15 | 23 | యుయ్య | యుయ్యె |
| 19 | 3 | జ తి | జాతి |
| 19 | 12 | బెంకి | బొంకె |
| 29 | 14 | ల్లాలి | ల్లాల |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 24 | 24 | నొక్క | కొక్క |
| 25 | 6 | లును | లను |
| 26 | 27 | వ్యా | వ్యాని |
| 27 | 11 | ంగుటిం | గుటి |
| 27 | 15 | గోర | గోరి |
| 30 | 13 | నిచ్చలు | నిచ్చల |
| 33 | 24 | గ్గునడ | గ్గుండ |
| 34 | 8 | బిడ | బిడి |
| 38 | 9 | తఁగా | తిఁగా |
| 38 | 9 | మురన్ | ముఁన్ |
| 38 | 15 | యమున్ | యముం |
| 39 | 10 | దఁజలె | దఁజల్లె |
| 42 | 1 | దునున్ | దుమారస్యాఁదునుక |
| 44 | 7 | చెప్పిన | చెప్పినన |
| 46 | 9 | చెనటి | చెనఁటి |
| 46 | 27 | నీటి | నీటు |
| 47 | 4 | భుజఁగు | భుజగు |
| 50 | 8 | నుండు | తుండు |
| 50 | 10 | నది | నయది |
| 51 | 3 | లేద | లేవ |
| 51 | 20 | నొప్పి | నొప్ప |
| 52 | 4 | బోవు | వోవు |
| 54 | 17 | టొప్పు | టొప్పు |
| 58 | 1 | సల్పె | సల్పొ |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 58 | 4 | సూపి | జూపి |
| 59 | 10 | వటందు | వటంచు |
| 60 | 2 | దున | దన ? |
| 61 | 5 | జల | బల |
| 62 | 3 | యిచు | యించు |
| 66 | 10 | స్యాండా | స్యానందా |
| 68 | 23 | వేళ్ళనో | వేనోళ్ళ |
| 70 | 10 | దేని | డేని |
| 70 | 11 | గుర్రై | గుర్తై |
| 76 | 7 | మిాతని | మాతని |
| 77 | 22 | సందు | నందు |
| 78 | 4 | త్రోష | రోష |
| 83 | 23 | ట్టుల | నట్టుల |
| 88 | 24 | చవు | చనవు |

ఈచూపినవి ముఖ్యమైన ప్రమాదములు అంటలేదని మొదట సూచించిన పూర్ణానుస్వారములోనగునవి దిద్దనేలేదు. అవి తఱచుగా బ్రాసస్థానమందుఁగూడ నున్నవి. కావున దిద్దకున్నను సులభముగాఁ బ్రాసస్థానమందుఁగూడ నున్నది. కావున దిద్దకున్నను సులభముగాఁ దెలిసికోవచ్చును. అట్టివి కొన్ని యితరస్థలములయందును గలవు. ప్రాజ్ఞులే ప్రమాణమని యుపేక్షింపఁబడియె.

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి,
శతావధాని.



శ్రీమత్పరదేవతాయై నమః.

# పాణిగృహీత.

(తిరుపతి వేంకటీయము.)



## ప్రథమాశ్వాసము.





శ్రీదుం డాప్తుఁడు. గౌరి భార్య, యచలశ్రేష్ఠమ్ము వాసమ్ము, వి
ఘ్నాదుల్ వాపెడివాఁడు పుత్రుఁడు, శుభం బర్పించుశబ్దమ్ము పే
రై దైవారెడివేల్పు నిత్యకరుణావ్యాప్తుండు పుచ్ఛాస్వయుక్
దాఁ దాత్పర్య మెలర్పఁ బ్రోచు నలసీతారామనామాంకితున్. 1

చ. గురు వగుబ్రహ్మపండితునకున్ నతిసల్పి జగత్ప్రసిద్ధవా
గురు లగుసంస్కృతాంధ్రకవియోగుల మ్రొక్కియు నేఁటి మేటులన్
గరము బహూకరించి యిఁకఁ గాకవితాభువనైకరాజ్యభా
స్వరులగు నామమాత్రకవిచంద్రులకున్ బొనరింతు మంజలుల్. 2

తే. గీ. లజ్జ గల్గిన పూర్వకాలమ్మునాఁడు, గోటి, కొక్కఁడు గల్గెఁబో ! సుకవి, నేఁటి
కాలమం దేమికర్మమో కవులనూటఁ, దొంబదులు కుపదమ్మునఁ దూఁగుచుండ్రి. 3

ఉ. కైత యొకండు గా దిపుడు కాలము సర్వము మాఱె వ్యర్థపుం
జాతురి హెచ్చె నల్ప మగుసాహితితోఁ బెదపెద్దపాత్రముల్
చూతురు తప్పు దిద్దుదురు, శూరత చచ్చెఁ గవీంద్రులందు సీ !
యూతులు గట్టివైచికొనఁ బోలదె? సత్కవులైనవారికిన్. 4

చ. తగుదుమొ లేదొ యంచు మదిఁ దత్తరపాటొకయింత లేక “మీ
దగుకయితమ్ము సూఁటితిమి యుం దది యుం దిది” యంచుఁ బద్దెముల్
దగులుతు రందుకోసమె మొదల్ దమ రుపుదు రిక్కవుల్ వృథా
యగుఁగద? వీరిసమ్మతు, లహా! తగువారి కివేల? కాల్పనే. 5

తే. గీ. అన్నిపాత్రమ్ములకు మొద లెన్ని ఫ్రటలో, నింకు నభినందనములతో దండుగకటు
యొక్కఁడేనియు నిజముగు నూహ వ్రాయఁ, డట్లు వ్రాసిన సద్దాని నడఁతు రో కటకట. 6

తే. గీ. భారతముపై నెవరి యభిప్రాయ ముండె, మనుచరిత మొద లేరి సమ్మతులు నిలిపెఁ
దీపి లేనిఫలమ్ముపైఁ దేనె చిలుక, నేమి యగుఁ దీపి గలదాని కేమి వలయు. 7

తే. గీ. చేతఁ గానిశతావధాని చేతిబిడ్డ, సర్టిఫికెట్లు కట్టులే, సహజశక్తి
గలుగువారల, కవి యేల? కల్పనే స్వతఃప్రకాశుఁడు గోరునే? తనకు దివ్వె 8

క. "సంగీతసాహిత్యులు వా, గంగనకుఁ గుచము" లనుట "హాస్యాస్పద" మం
చుం గన్నులుగా దిద్దెడి, శృంగారవిదుల్ కవీంద్రు లిక్కాలమునన్. 9

ఉ. ఇంతకు నింత మాఱె నిఁక నిన్నుయనంబులు గూడఁ జుంబనా
క్రాంతము లౌట మోటు మనఁ గాళ్ళకు మారురొ వ్రేళ్ళటందురో
తి.త్రిణికాఫలమ్ము లనఁ దీఱదె? పూర్వకవీంద్రు లక్కటా!
యింత వివేకముం దెలియరే? యది దిద్దెడిపాటివారమే? 10

క. స్త్రనకల్యపరీక్షకుఁ బో, యిన ఫలముం గలదె! వాని నిటు పోల్చినయ
య్యనఘునిభావము నెఱుఁగిన, జనుఁ డేగతి దిద్దు? నది రసం బెటు లిచ్చున్. 11

తే. గీ. ఇంతమార్దవ మెఱుఁగియు నిహిహి! వీను, బాలకుల కంచుఁ జేసినపాఠపుస్త
కము నసుఖరోగము లెగాధ నిముడఁజేసి, రటను పాధ్యాయు లెటు చెప్పఁగునో? యకట!

ఉ. కంకురకుంకలైనపలుగాకికలార్థుల కెట్లు పాఠ మీ
యంకపురాణముల్ నయభరప్రద మంచు వచింప నొప్పు? నా
శంక యొనర్పరే? నగరె? "సర్వము నీతికె" యందురేని మీ
శాంతుని చెల్వు నారతిరహస్యము పాఠము పెట్టరాదొకో! 13

తే. గీ. తగినసామగ్రి దొరకిన ధార లేదు, ధార గల్గిన సామగ్రి దనరఁబోదు
రెండు గల్గినవారితో నొండు గల్గు, వారు డీకొన నది నగుఁబాటు గాదె? 14

ఉ. క్రొంచెము గొప్ప సంతసము గొల్పఁగఁ జూడుఁడు చించివేయుఁ డే
మంచియు లేనిచో, నిదియె మా నమనమ్ము, లనుగ్రహించి మ
న్నించుఁడు కాశినాథబుధ నేతవిధాన వృథావివాదముల్
పెంచకుఁ డాగ్రహించకుఁడు "సెప్పెపె" యందురు మే మెదుర్కొనన్. 15

చ. పరిణతశక్తు లైన యలభారతపుంగవు లట్టు లుండ మ
స్కరుఁ డనిపించుకొన్న కవిసామజసింహము రామకృష్ణ వా
గ్విరచనగూడఁ జూడుఁడు ప్రవేశఫలమ్ములు చిన్న చిన్న వ్యా
కరణపుఁబొత్తముల్ గొణిగి కయ్యముఁ బెంచకుఁడయ్య! వాగ్విభుల్. 16

క. తొలిబాసయందుఁబలె నీ, తెలుఁగుంబాస వెలయించుదీపము లేమిన్
విలువఁగలకవులలక్ష్య, మ్ములె తా మీభారమెల్ల మోయఁగవలయున్. 17

క. ఈభాగము మే మల దే, వీభాగవతమ్మునందు వివరించితి మీ
క్షోభ యిటు మరల నేల? ప, రాభవ మందకుఁడు పైకి రాకుఁడు సుకవుల్. 18

ఉ. కాలముఁ బట్టి దేశమును గాంచి ప్రభుత్వము నెంచి దేశభా
షాలలితాంగి మాఱు టది సత్కవిసమ్మత మౌట నన్యదే
శ్యాలను నాంధ్రభాషఁ గలపాటను నౌచితిఁబట్టి మేము క
బ్బాలను వాడుచుంటి మవి పండితు లేగతి నొప్పకుందురో. 19

మ. అగుఁ గావ్య మ్మిది, యైనన్ బ్రహసనప్రాయమ్ము, ప్రారంభమా
దిగ దీనన్ బలుచోటులన్ బొసఁగు నెంతేనిన్ రసాభాస, మో
మగునన్ నాయికచేఁత, దుర్విటులనిర్మర్యాదవాక్యమ్ము, లో
ప్పుగ దానిన్ వెలయించుఁ బండితులు తప్పుల్ దిద్దురేమో కదా? 20

తే. గీ. కవిత యన్నపు డెవరివాగ్రచన యట్లొ, దాని కనుకృతి సేయుటే తగినఫణితి
అంతియేకాని యెల్లెడ ననుగుణపు, శైలి గల్పించు టది యెట్టిచంద మకటా? 21

తే. గీ. మాలపల్లె వర్ణించుచో మహితులను, జెప్పఁగతి దుర్విటులు వాడుతప్పుకూఁత
లెంతమృదువుగా మార్చినఁ గొంతయైనఁ, బచ్చి యుండక మాన దప్పట్ల నిజము. 22

క. అనరాదు గాని యప్పుక, విని "గనులున్ జనులు మొదలు వేయఁదగని" వం
చనిరియు నివి భారతాదులఁ, గనుఁగొనెనో లేదొ, శతము గన్పడు నకటా! 23

ఉ. తా నొనరించుకట్టునకుఁ దప్పినపాత్రము లెన్నియెన్నియో
మానుగ లక్ష్యసంగతుల మన్ననచేసి యదేమిపాపమో!
మానెను బోతరాజకవిమండనువాగమృతంబు గ్రోలలే,
కైనను దోసముల్ గలవె? యయ్యెడఁ జక్కఁగఁ జూచువారికిన్. 24

ఉ. ప్రాసను రేఫఱల్ గలిసి రాదని పెద్దవివాద మెంచెఁ దా
నేకతనుండి వ్రాసెనొ కవీంద్రుఁడు నన్నయ, కల్పనానిశా
రే! కవు లొక్కరే, నుభయరేఫలెయున్నె! నణల్, శసల్, లడల్,
గాక యభేద మీయొకటి కా! తగదంచఁటు, మేలు మేల్! బళీ! 25

శా. శ్రీనాథాదుల కేనిలోపములు వర్ణించెన్, రలాభేదసం
ధానంబున్ దెఁదెంచె దిద్ది, యది గన్నన్ సర్వరే! శాబ్దికుల్,
తా నేయేటువి లేవనెన్ దనకు సంతర్వాణు లౌసత్కవీ
శానుల్ వాడిరి విస్తరించుటకు శాస్త్రం బెట్లు వీ లియ్యెడన్. 26

క. ఎఱిఁగి ప్రయోగించినదో, యెఱుఁగనిదో తెలియవలయు నిచ్చో నలవ్యా
కరణప్రభావ్యములో వ్రా, సిరి చీవాట్లిడిరి లక్ష్యసిద్ధి దెలుపుచున్. 27

క. ఎన్నెన్నిపాత్రములు కవు, లెన్నెన్నివిధాలఁ జెప్పి రెన్నెన్నివిశే
షోన్నతు లరెమ్యెడఁ గవుడు, నన్నయఁ దెలియంగ శక్యమా! యొక్కనికిన్. 28

తే. గీ. వాఁడిదౌర్బల్యమే కాని లేదు వాద, దుర్బలత్వము, లక్ష్యముల్ దొరక వనుట
బొత్తిగాఁ దప్పు, తెలుఁగున బొంకి రిట్లు, సంస్కృతమ్మున నింతగా సాగ దాట 29

ఉ. ఇంతకుఁ బోతరాజకవి నీకఁడు వాఁ బహివెట్టె దానిచే
నింత లిఖింపఁగావలసె నిందుకుఁ దిమ్మకవీంద్రుఁ డేమి, ను
ప్యాంకులు తక్కులాక్షణికు లందఱు నేమి, యెదిర్చి యక్కవిన్
గొంతికిఁ దెచ్చి రప్పకవి కా దనుమాత్రములోనఁ బోయెనే. 30

మ. యతిరో ప్రాసయొ తప్పు చేరికని రాదా! దానఁ బాండిత్యవి
స్ఫృతికిన్ లోపమె! భ్రాంతి పండితులకే, "యేవార్థమప్యర్థ్యయ"
మ్మతిపూర్వోక్తి దలంపుఁ డొందఱును దా మీపూర్వపుంబోత్తమల్
వతి మన్మఖ్యులు దిద్దకే కలిగెఁ బ్రామాణ్యమ్ము, యోజింపుఁడీ. 31

ఉ. వారికి నిచ్చరచ్చగతి వారును వారును దిద్దరేని యా
భారతమాదిగాఁ దెలుఁగుబాసను సంస్కృతమందు నొక్కటే
దారిని బోవు పాఠములు, దానికిఁ గారణ మేమి! యిప్డు ము
ద్రారచవాళ్ళయమ్ములను దప్పులనుప్పులు కొన్ని చొప్పడున్. 32

వ. అని శిష్టాచారచ్ఛలమ్మున నూత్రిప్రాయమ్ముగ నెంచుక చర్చించి యొక్కెడఁ గార్య వశమ్మున బృందావనపురమ్మున కరుగుటయు నయ్యెడ నాబాల్యమిత్రుండును నవా దిపవిత్రతర పుచ్ఛావంశసంభూతుండును గానరసకోవిదుండును గవితాధురీసురీ ణుండును నగు సీతారామనామకవిప్రధనదతనూజుం డొక్కఁడు.

ఉ. తా నొకవార్తనిన్ శ్రుతిసుతారముగాఁ దగుదాని నూని డెం
దానఁ బ్రీతి గొల్పఁగతిఁ దానముఁ బల్కఁగఁ జేయుచున్ మతిన్
దానికి వేఱు గానిగతిఁ దంబుర మీటుచుఁ గొంద ఱల్ల "రా
నా" యనురీతిఁ బాడ నది హాయిగ వించుఁ దదేకచిత్తుఁడై. 84

వ. కొండొకసేపు విస్మృతసకలప్రపంచుండై కాలక్షేప మొనరించి చిఱునవ్వు నవ్వు
చు భక్తిపురస్సరమ్ముగా నిట్లనియెను. 85

చ. "తిరుపతివేంకటేశ్వరులు తియ్యనిమాటలతోడ నూరి పా
మరులను మెచ్చఁగాఁ గవిత మంచిగఁ జెప్పెద" రంచు వించు సం
బరపడుచుంటె కాని యొకపాటిప్రబంధము నైనఁ గైకొనన్
జిరమునుండి యత్నమును జేసియుఁ గానయితిన్ గృతార్థుఁడన్. 86

తే. గీ. ఆత్మకూరునృపాలునియట్లు మిమ్ము, నేనుఁగంబారి నెక్కింప నేము కాని
తక్కసమ్మాన మొనరింపఁ దగినపాత్రి, సిరి గలదు ముందు నాకు లచ్చిపతికరుణ. 87

చ. అన విని "నీ కొసంగు టొకయబ్బురమే? మఱి విప్రులందు శ్రీల్
ధనమున దాతృతాగరిమఁ దక్కఁ బ్రశంసల నూటనాఁటఁ ద
క్కిన గలరే? నినున్ దొరయఁ కీర్తిపరుల్, కయికొ మ్మవశ్యమున్
మనమున శిష్టమైనకృతి మాన్యతకున్ దగుదాని" నావుఁడున్. 88

ఉ. ఇప్పటికెంత లేదనిన నిర్వదికిన్ బయినుండు మీకృతుల్
తప్పక సేయు శాశతవధానపుఁ బద్దములున్ నృపాళిపై
గుప్పినపద్యముల్ గలవు కొల్లలు, భాగవతంబు దీనిలో
గొప్పది, దానినేను మనుగోరితి, నీ యుకపోతి రెందుకో? 89

మ. ఋతువుల్ పర్వతముల్ సముద్రములు నీరేజాకరమ్ముల్ శత
క్రతుముఖ్యామరసంఘముల్ తెలచుగాఁ గబ్బమ్ములం దెల్పెడన్.

కుత్రిలలఁ దన్పుమనంటఁ జేసి యిఁక నేఁ జోద్యమ్ముగా నూత్నపుం
గృతి నిర్మింపఁగఁగోరెదన్ నయమునన్ శృంగారమున్ మీఱఁగన్. 40

చ. మనుజున కెద్దియో యొకతె మానిని యుండుట యొప్పునో! కుల
మ్మున కనుకూలమైన విరిబోణియొ యంచొక నేమమా! యిఁటన్
మనమున నెంచి చూడ నెట మంచియిహమ్ముఁ బరమ్ము వాయదో!
వినవలె దీనికెంతయును వీలగు గాథ రచింపఁ జొప్పగన్. 41

వ. అని సకర్పూరతాంబూలమ్ము కట్టి యంబరాద్యర్పణమ్ముల సంతుష్టిగావించుటయు
నలరి యతని డెందమ్ము చందమ్ము గుఱుతెఱింగియు మఱింత విశదీకరింపఁదలంచి
యతనిఁ గూర్చి. 42

ఉ. పాణిగృహీతి యందుర వివాహితయైన సతిన్, దనంతఁ దాఁ
బాణి గ్రహించి యుంచుకొను భామ సతోత్తమ శాబ్దికాగ్రిణుల్
పాణిగృహీత యందు రొక వర్ణమునందునె కాక యెన్నియో
పాణిగృహీతికిన్ గలవు పాణిగృహీతకునన్ బ్రభేదముల్. 43

ఉ. దున్నయు నేమఁగున్ సరిగఁ దూఁగునె! యంచయుఁ గొంగయొందు నే
నెన్నఁడు గాని సాటిగను నే! మఱియొక్కఁడు కెక్కి డక్కటా!
వన్నెయువాసియున్ సుపథవర్తనమున్ జెలువారు భార్యకున్
మున్నరికంపుఁదొత్తునకు మాధుతెఱుంగఁగ లేరహో! విటుల్. 44

వ. అన నతం డిట్లనె.

చ. విటులకు బుద్ధివచ్చుగతి వేశ్యలకున్ దలవంపుగా విశం
కటపదగుంభనమ్ములను గాక కడున్ సులభంబుశైలి నొ
క్కటి రచియింపుఁడీ! కృతిని గైకొనఁ జిన్నటనాఁటనుండి మి
క్కుటముగ నన్ను నెక్కలపుకోరిక లిప్పటి కీరికల్ గనన్. 46

వ. అనుటయు

ఉ. ఇందుకు గ్రంథజాలము లనేకములున్నవి దుష్ప్రవర్తనం
బందుఁ బురాకృతింపు సుకృతాతిశయమ్మునఁ గాలుపెట్టకే
డెందము తక్కయుండవలె డెప్పరమై యటుగాక తక్కనన్
విందుమె! యొందు వేనియును వెన్కకుఁ ద్రిప్పఁగఁ జేయుకబ్బముల్. 46

చ. సుకృతపుబుద్ధి మాఁటలను సుందరియే గురువ౭చుఁ దోఁచు దు
ష్కృతులె యోగమమ్ములగు జావళులే నయబోధకమ్ములౌ
నకటకటా! యొకానొకని కర్గలమై తగుజన్మమ్మునం,
దొకనికి బుద్ధిమార్పడకయుండుఁ బురాకృతపుణ్యసంపదన్. ౪౨

వ. అయినను ఖాటించువార లసదని నీతన్ బోధింపమానఁదగదు గాన నీమనోరథంబు చొ
ప్పున నట్లన చెప్పెదమని యంగీకరించి యాచారమ్ము కతవఁ గృతినేతయగు నతని
వంశమ్మొకింత వర్ణించెదము. ౪౩

బ్రహ్మముఖోత్పన్నంబై యొక్కుడు ప్రశస్తికెక్కు నాదిమవర్ణంబునం దొక యవాంత
రశాఖ యగు వెలనాటి వంగడమ్మునందు గౌతమసగోత్రమ్మున “పుచ్చా” నామక వంశ
మ్మున ననేకులు మహామహు లుద్భవించి యశమును గాంచి మించిరి. అందుఁ గాల
క్రమమ్మున విశ్వనాథభొట్లు శుభమ్యుండుదయించె, నియ్యనఘునికి విశ్వేశ్వరసోమయా
జులు జనించి యఖండ పండితుండై ప్రశస్తిచఁదుటయే గాక దంతులూరను నొక
యగ్రహారంబు సంపాదించె. నీమహనీయు కొమరుండు లక్ష్మీనారాయణశాస్త్రి,
ఈతనికి వెంకటసోమయాజియు, విశ్వేశ్వర సోమయాజియు, సీతారామసోమయా
జియు, లక్ష్మీపతి సోమయాజియు, కామేశ్వరసోమయాజియు ననునేవురు సార్థక
నాము లుదయించిరి. అందుఁ గనిష్ఠునకు శీతారామశాస్త్రి, రామయ్య, రాజయ్య
అను సుతత్రితయ మావిర్భవించె. వీరిలో రామయ్యకు పూర్ణయ్య, లక్ష్మీనారాయణ,
కృష్ణయ్య, శ్రీరాములు, విశ్వనాథము ననునేవురు సుతులుదయించిరి. ఈయైదుగు
రును సుప్రసిద్ధులే యైనను నిందు ద్వితీయుఁడగు లక్ష్మీనారాయణాహ్వయుండు
స్వార్జితాఖండసంపత్సంపన్నుండును నిరతాన్నదాన నిరతుండును మహావదాన్యుం
డునునై మిగుల యశమునందె, ఈయన్నదాతయే బెజవాడలో సత్రముంచిన పరోప
కారి. ఈతని యన్నదాన మహత్త్వముంగూర్చి యేమి యితరయోగ్యతలను గూర్చి
యేమి యెంతయైనను వ్రాయవలసియే యుండును. ఈతఁడనపత్యుం డగుటవలనఁ దన
పిన్నతమ్ముఁడగు శ్రీరాముని కుమారుని దత్తుఁగాఁ జిన్నటినాఁడ గైకొనియె. అతని
పేరు సీతారామయ్య, ఈ మనకుఁ గన్నతల్లి జోగాంబ, పెంపుడుతల్లి లక్ష్మాంబ
ధర్మపత్ని లక్ష్మీదేవి, వీరలందఱును సద్గుణసంపన్నలు, ఈవంశము వేదవేదాంగాది
విద్యలకు నాకర మనియు తద్విహిత కర్మానుష్ఠానమునకుఁ గుదురనియు నిందలి

మహాపురుషుల నామములే కొన్ని సహస్రముఖముల వాక్రుచ్చుటంజేసి యావిష
యమును మరల విస్తరించుట పునరుక్తియని యాజోలికిం బోక యీయన్వయమునం
దెల్ల నెక్కుడు త్యాగభోగరాయఁడని లోకులచే నెన్నఁబడు సీతారామాహ్వయుం
డీకృతికి నధినేత కావున నారసికునకు నభ్యుదయ పరంపరాభివృద్ధిగా మాయొనర్పన్
బూనిన పాణిగృహీతయను కల్పిత ప్రబంధమ్మునకుఁ గథాక్రమంబు. 29

ఉ. పత్తన మొక్కఁడొప్పు "హాటపావకముఖ్య దిగీశలోక సం
పత్తులకెల్ల నొక్కయెడఁ బద్మభవుం డిరవొందు చేయఁగాఁ
జిత్తమునన్ దలంచి యిది చేసె నిజ" మ్మని యెల్ల పాండితీ
వేత్తలు దన్నుతింప నరవిందసమాఖ్యఁ బరిమళించుచున్. 50

మ. నదికిం దాపఁట చుట్టుపట్టులను నానందమ్ము పుట్టించుచె
ల్వావనన్ వత్తిలు తోఁటలొప్పునఁట వాయుప్రేరణన్ సౌరభా
భ్యుదయం బెప్పటికప్పు డుండునఁట యే యుద్యోగము న్లేక సౌ
ఖ్యదశన్ జీవన మయ్యెడన్ గలదఁ టన్యం బట్టి దొం దుండునే? 51

ఆ. వె. లచ్చి యెల్లవేళలను నందుఁ గాపుర, మ్ముండుకతన దాని కొదవుపట్టి
పేరు సార్థకంపుఁ బెంపునఁదగె నేతి, బీరకాయరీతి నీరసిలక. 52

తే. గీ. వెండికొండల మాదిరి వెల్లదీవు, లవిధమున మల్లెపూలరాశి వడువునను
సంతత సుధామహోల్లసత్సౌధ పటలి, కనులపండువు సేయునక్కటకసీమ.

మ. కనకమ్మన్నను లోష్టమన్న సరిగాఁ గన్గొంచు నన్యాంగనన్
జననింగాఁ దలపోయుచున్ నిగమవిశ్వాసమ్ము పోనీక నె
మ్మనమెల్లప్డు విరాగమంద యిడ ధర్మప్రక్రియన్ బొల్చి తా
మనసూయా పరులౌట సత్ప్రిలఁసుమీ! యాప్రోలి విప్రోత్తముల్. 54

చ. అరిమదభంజనమ్మునన యాగ్రహ, మాగ్రహ మబ్బినప్డున్
శరణను వారిఁ బ్రోచుట యశమ్మను జ్ఞానపు మేలిగుత్తు, సం
సరణమసారమం చెఱుక, క్షత్రియజాతిఁ బెట్టెసొమ్ముల
ప్పురమున, నేల శూన్యమయి పోవు నిహమ్ముఁ బరమ్ము వారికిన్ఁ 55

తే. గీ. సాధుసజ్జన నామముల్ సంతరించి, నట్టి తమపూర్వపురుషుల యశము చూచి
కాని క్షత్రియకృత్యమ్ము లైకొనంగఁ, దగుదు రప్పురికోమటుల్ ధనదసములు. 56

ఉ. ఎండలవేళ దున్న రది యొద్దులగానికి హేతువంచు, బ్రి
హ్మాండము క్రిందుమీఁదయిన వాడినమాటకుఁ దిద్దులేదు ష
ట్కాండలు రామసచ్చరిత గాక యనేకపురాణజాలముల్
మెండుగఁ దామెఱింగిన సుమేధసు లప్పురి నున్నవాదజుల్. 57

తే. గీ. పూవులమ్మఁటఁ గని పువ్వులావికలని, గుఱుతుపట్టుదురే కాని కొనబుతనపుఁ
బలుకులును మేనితళుకులుఁ గులుకుఁజూపు, లౌం! వారాంగన లటన్న యాసకొలుపు

మ. ఎలనీటిం బురణించు నీర్గలిగి తా మేకాలమందింక క
ప్పాలతో నిండియు నూరకే యొకరినిం బోనీక పంకమ్ము లో
పలనుం దాల్పక యోగిచిత్తములరీతిం దాల్చు నవ్వీటి బా
వులు గన్గొన్న మహెట్టి పాంథులకుఁ బోవున్ మేనిగూ డాసముల్. 59

తే. గీ. శాంతియాజ్ఞించుపొంటె వేదాంతములను, జనవనేటికి? క్షమకునై జపతపమ్ము
లూననేటికి? నప్పురినున్న మత్తగజముల పవిత్రవమూగన్నఁ గలుగవొక్కొ. 60

క. తమసహజుఁ డుచ్చపదవిం, గొమరారుట తాముక్రిందఁ గుర్విమ్మనుటయు నైఁ
పమి నచటి సైంధవములు న, భముపయికిం దుముకు దవ్వుసూవారెసిపట్లన్. 61

ఉ. తాళి యొకండు లేదనెడి తప్పిద మొక్కటితప్ప గేహినీ
లీలలఁ దమ్ముఁజేకొనిన లేఁతబోజుంగులఁ దన్పుచున్ గళా
శాలిను లౌటకుం ఫల మసత్యము దూరముచేయుట ద్ధన
స్త్రీలు నిజమ్ము లంజెలఁ బతివ్రత లన్న మహేమి దోసమా. 62

ఉ. అందొక భూసురుండు సకలాగమవేత్త యనాదిసుప్రసి
ద్ధిం దగువంశమున్ మతిరయో దీప్తికిఁ దెచ్చెడి సద్గుణవ్రజం
బుంది చెలంగువాఁడు నిరతాన్నవితీర్ణికి సాటిపట్టు న
స్పందితచిత్తవర్తనుఁడు భాసిలు శంకరయ దన్న పేరునన్. 63

మ. పరకాంతాపరకీయవిత్తహరణప్రారంభముల్ సేయుము
ష్కరులం బీనలఁబెట్టఁ డొక్కరొకఁ డాక్రోశమ్మునం జేసి ద
గ్గఱిఁ బిన్నను హా! శివా! యనుమ లోఁ గంపించుటే కాక య
ద్దొరితంబుల్ బెడఁబాపఁ జేసికొను నెందుం లేని సత్కర్మముల్. 64

ఉ. వైదికుఁడయ్యు లౌకికప్రవర్తనమందును బ్రజ్ఞ గల్గి సం
పాదనచేసె లక్షలకుఁ బైఁగడు పెద్దగు విత్త, మగ్రజ
శ్రీవరుఁ డిట్లు కాంచియును జిత్తజుబారికి లోఁగియుండె వే
ఱేవియు లేని దుర్వ్యసన మేర్పడియుండె వ్యయింపఁ డింతయున్. 65

సీ. కట్టించె మిగులఁ జక్కనిరీతి నన్నదానము సల్పనట్టిసత్రములగములు
చేయించె నెంతటో చేసాది యడిగిన బ్రహ్మచారులకు వివాహములను
శివకేశవులకు పెద్దిగభక్తి నూరూర నమరఁగాఁ జేసె దేవాలయములు
వేయించె ధర్మార్థమై యింపుఁ బెంపారునట్టితోఁటలు నూటికన్న పెచ్చు;

తే. గీ. యజ్ఞములు సేయఁ జేసెఁ బైనందెఁ గృతులు, సగ్రహారమ్ము లొకకొన్ని యాపరిచెఁ
డిక్కునిఁక లేవు సప్తసంతానములను, నొక్కసంతానమే లేకయుండెఁ గాని 66

ఉ. ఆతనిభార్య యందులకె యాత్మ సదా దిగులొందుచున్ బురా
రాతికి గౌరికిన్ సిరికి రాక్షసవైరికి వాణికిన్ సదా
ధాతకుఁ దక్కువేల్పుల కెవన్ మదమిచ్చువ్రతమ్ము లెన్నియో
చేతికొలంది దానములు సేయుచుఁ జేసెఁ బ్రియుండు మెచ్చఁగన్. 67

వ. ఇట్లు పతివ్రత యనేక కాలమ్ము నానావ్రతమ్ము లొనర్చియు వివిధనదీనదమ్ములఁ
గ్రుంకులిడియుఁ దదకు వినువుటయు నతండు 68

క. "అన్నతనూజునకును దాఁ, గన్నతనూజునకు భేదగతి గల్గునె?" యం
చున్నతరూపవిశాలుల, నన్నయుఁ దనయన్నకొడుకు సాఁకఁగ నెంచెన్. 69

తే. గీ. ఎంచి తనభార్యఁ గాంచి యిట్టులనియె, "గలికి! యెన్నాళ్లులిటు కష్టతికి నోర్చి
కల్పములనన్న వ్రతములు కడఁగిచేతు?, విది పురాకృతకర్మమ్ము కట్టులడఁచు? 70

వ. సంతానమ్ము లేకయుండుట యిహలోకానందమ్మునకె కొంత కొఱఁతఁ గలిగించుఁ గాని పర
మ్మునకించుకయు భంజకమ్ము గానేరదు "అపుత్రస్య గతిర్నాస్తి" యని కేవలకర్మ
ఠులు చెప్పుదురే కాని యద్దాని జ్ఞాను లొప్పరు. 71

తే. గీ. ముక్తినందెడి వానికి ముఖ్యమొక్క, జ్ఞానము గాని యితరమ్ము గాదు దాని
సేవయు లేమందు నొకపాటిహీనములు, కియ్యదియు నొక్క తెరువని యెఱుఁగు మబల.

సీ. భీష్మున కెందఱుబిడ్డలు పుట్టిరి? శుకయోగి కెందఱు సుతులుఁబొడమి ?
రల యాంజనేయున కాత్మజులెందఱు? గణపతి కేపాటి కాన్పుగలదు ?
వైవారలందఱు పడిరె? దుర్గతుల, సంతానమ్ముఁగల్గనెందఱు మనుష్యు
లిపుడు పిశాచాది హీనజన్మమ్ముల నెత్తుట లే దింతయేల? పుత్రుఁ 72

తే. గీ. డెంతయును యోగ్యుఁడగునేని యిహమునందుఁ
దమకుఁ బరిచర్య సలుపుట దక్కఁ బరము
నందొకింతయుఁ గాఁడు సహాయుఁ డొక్క
రుఁడల నగునందువేని నీ విదియు వినుము. 73

వ. పుత్రునివలన ముక్తిగలుగునని చెప్పెడిపురాణమ్ములే వారు పదితెఱఁగులనియు నందు దత్తుఁడును బరగతికి సాధన మ్మగుననియు ఘోషించుచున్నయవి కావున. 74

క. నాయన్నకు సుతులెందఱొ, శ్రీయుతు లున్నారు మొన్న చిన్నసుతుఁడొకం
డాయుర్భాగ్యసమన్వితుఁ, డై యుద్భవమందె వాని నగుఁ గైకొనఁగన్. 75

వ. ఉదారుండను పేరున నొప్పు వానికిప్పుడు వయస్సు మూఁడు నెలలగుటయుఁ గర్మవశమ్మునఁ దలిదండ్రు లిరువురు గతించుటయు నీ వెఱుఁగనిది కాదుగదా ! అట్టి శిశువుఁ బోషించుటయె మనకు నిహపరలోకమ్ములకు సాధనంబగునప్పు డవ్వానికి మనసకలసంపత్తులుంగూడ నొసంగుట యెట్టి సుకృతం బొనఁగూర్ప నేరదు ? మఱియు నొక్కవిశేషంబు గల దాకర్ణింపుము. 76

చ. కనఁగవతీయ నెమ్మొగముకాంతియుఁ జెక్కులసొంపు నాసయు
ప్పును నళికంబు చందమును ముద్దులుగుల్కెడి లేఁతనవ్వుపె
ల్పును వెడఁదైన పేరురముపోడిమియున్ మిసిమిన్ జెలంగు మే
నును గన వానిఁ బ్రాకృతజనుం డనబోల దొకించుకేనియున్. 77

ఆ. వె. "ఎచట రూపముబ్బ నచట గొనములు సంభవించు"నను చు శాస్త్రవిదులు
పల్కుచుందు రింకఁ బనిలేదు యోజింప, వాని స్వీకరింపవలయు నను చు

చ॥ పతిఁగని యిట్లు పల్క నలపావని "యోయనఘాత్మ! మీరలా
నతి యిడి నప్పుడే యదియు నాకును సమ్మతమైన నిందులో

ఉ. అంత వయస్సువచ్చుటయు నాకృతికిన్ సమమైనదాని ర
వ్వంతయు నేని లోటు నొకయందును లేని సుశీల బంధుతా
శాంతిఁ గులాభిజాత ఘనమ్మగు లగ్నమునన్ వివాహమున్
సంతసమొప్పఁ జేసిరి పసందని యెల్లరుఁ జూచి మెచ్చఁగన్. 95

ఉ. నాఁటి సదస్యులన్ దినమునన్ వెలహెచ్చగు చేలుజోడులన్
నూటపదాఱులున్ మఱియు నూతనవస్త్రములున్ వరాలు నే
పాటి కలాఢ్యుఁడేనియును బంచె సుదారుని తండ్రి, ద్రవ్యమున్
గోటులు సేయఁగాక బుధకోటికి నీగతి నీయ వచ్చునే. 96

ఉ. ఆపయిఁ గొంతకాలమున కాసతికిన్ వయసంపరిప నా
యేర్పడ నిర్వురన్ గలిపి యింపుసొంపులుఁగుల్క దంపతుల్
గాఁపుర మాచరించుగతి గాంచి కుతూహల మంది "వీరికిన్
బూఁపలు గల్గఁగాఁ గలయుఁగో!" యని నెమ్మది సొంపుమందఁగన్: 97

మ. తనకుం గాలము చేరువౌటయును నాతం డత్త నాత్మీయమా
ఘనపుణ్యమ్మున నాత్మకామధను లోకంబైన కైలాసమున్
గననేగన్ దదనంతరంబునను దత్కాలోచితంబుల్ క్రియ
మ్మనఁ గావించి యుదారుఁడెంతయును సొమ్మున్ వెచ్చఁబెట్టెన్ వెసన్. 98

చ. పిదప కొంతకాలము వివేకులు మెచ్చెడిసత్ప్రవర్తనం
బొదవఁగఁ "దండ్రికన్న నితఁ డొక్కట లోఁగ" డటన్న ఖ్యాతికిన్
గుదురయి తల్లిగారి కనుదూలుఁడునై సతికిం గుతూహలా
స్పదుఁడయి భాగ్యశాలుఁడయి సంస్కృతిఁ జక్కఁగఁబెట్టె నొప్పుగన్. 99

సీ. అగ్రహారమునుండి యరుదెంచురైతుఁ గని వారి కష్టసుఖమ్ము లడుగు
నడిగి వారలు చెప్ప నాయాయి సంగతుల్ విని శిస్తులోఁ గొంత విడిచిపెట్టుఁ
బెట్టి యింకను గనిపెట్టఁగాఁ గలసినఁ బెట్టుఁబడికిఁ గొంత విత్తమిచ్చు
నిచ్చి యాసామి పంట వచ్చు కారున నౌఁడోరులను బంపక తాన రూఢి నరుగు

గీ. నరిగి దాదాపు భూమి లేమైన నమ్మ, కమునకరుదేఁ దప్పక క్రియమొనర్చు
నిచ్చు నార్జించుసకలమ్ము "నితనికన్న, భాగ్యశాలులే" రని జనులు మెచ్చ. 100

తే. గీ. ఎవ్వ రెవరికిఁ దండ్రి యేయే విధమున, వార్షికము లిచ్చెఁ దాఁ బ్రతివత్సరంబు
మఱియు నెవ్వరి నేరీతి మనుచు నితఁడు, వంశకర్తృకుఁగాఁ జూచు నన్ని మొదల. 101

మ. వ్యవహారమ్ములు చక్కఁబెట్టుకొను భృత్యవ్రాతముల్ ప్రోచు న
ధ్యవహారమ్మునరిపఁ డెవ్వఁడును దేవార్చా విహీనమ్ముగా,
నవముల్ సేసెడివారి కిచ్చు మఱియున్ సత్రమ్ములం గట్టు లో
పవిధుల్ దీర్చుఁ బురాణముల్ విను మహాప్రాగ్భారదూరాత్ముఁడై. 102

శా. "ఐశ్వర్య మ్మధికమ్ము గల్గియును గర్వాంధత్వముల్ లేక యా
యైశ్వర్యమ్మెల్ల నుతింప ముల్ బ్రియముఁ డావిర్భూత సత్కీర్తియై
శశ్వత్కార్య విధాతయై నెగడెఁ దత్సామ్యమ్ము వారుండు దా
విశ్వాసమ్మునఁ గైకొనంగలఁడు" నా వేత్తృశ్వ పర్యాప్తుఁడై. 103

చ. మెలఁగెడి యయ్యుదారునకు మేటిగఁ జిన్నతనమ్మునుండి యిం
పులు గులుకంగఁ బాడునెడఁ బూరుషులైన వెలందులైన మి
క్కిలిగను నాదరించు టది కేవలముల్ సహజప్రచారమై
యలవడి యంతకంత కది యంతునుబంతును లేక వర్ధిలెన్. 104

సీ. "బెంగుళూరున మండుభీమసానికిఁ మాత్ర వీణలో నెంతేని జాణ" యనుచు
"పచిలీపురమునఁ బెమ్మసానిమనుమరా లభినయమ్మునఁ గడునధిక" యనుచు
"గద్వాలిలోన వెంకాసానిచెలియలు సాహిత్యమున మేటిచతుర" యనుచు
"బళ్ళారిలోనఁ బాపాసాని చదరంగమున జాణమున పేరు గనిన" దనుచు,

గీ. "కామశాస్త్రప్రశంసయుఁ గాత్రపుఁజవి, చెన్నపురిసానులకు వన్నె దిన్నె"లనుచు
దఱచు నాభాసరసికు లాతనిసమీపమునఁ బొగడుచుండ్రు గానంపువినికిఁ దెలిసి. 105

చ. వినివిని నాఁడునాఁటికిని వెత్తి శిరమ్మునకెక్కి యేదియో
యనిసెపమూని వాండ్రు గఁబట్టణముల్ గననూహ సేయు నం
తన "వనసేల యియ్యెడక తాఁ బిలిపించిన రారె" యంచు నె
మ్మనమున నెంచు "నట్లయిన మాత కనిష్ట" మటంచు లోఁగనున్. 106

మ. అతఁ డీరీతిని గానమందు ఘనమౌ నాసక్తి దీపింప నా
త్మ తదీయంబుగ దాసికై యధికమౌ ద్రవ్యమ్ము వెచ్చించుచున్
గుతుకమ్మొప్పఁగ నభ్యసించుచును దక్కంగల్గు కార్యమ్ములన్
మతి పోనీయక తన్మయుండగుచు నున్మత్తాత్ముఁడై వర్తిలున్. 107

గద్య.

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం
బైన పాణిగృహీతయందుఁ
బ్రథమాశ్వాసము.



# పాణిగృహీత.

## ద్వితీయాశ్వాసము.



పుచ్ఛారులదీపక
కోపాదికదూర గానకోవిద సుమశీ
ప్రాపక దాతృత్వగుణ
శ్రీపూరిత నిత్యసదయ సీతారామా!

తే. గీ. అవధరింపు మనంతరం బతిసకల, కుసుమసంపత్తుకు మేలికోర్కె యగుచుఁ
బస గలుగుదంపతుల పాలిపంట యగుచు, నలమె నెల్లయెడల వసంతాగమమ్ము.

శా. అక్కాలమ్మున నాతఁ డేమ్యదియు కార్యం బుండుటం బట్టి తా
నక్కార్యమ్మును దల్లికిం దెలిపి యా యంగీకృతిం బొంది యు
ప్డక్కన్ బాయని ముద్దరాలిఁ దనభార్యన్ మెల్లనొప్పించి తా
నొక్కండుం జనె భాగధేయపుర మత్యుత్సాహ పర్యాప్తుఁడై. 3

ఉ. ఆపురిలోన నాటకము లాడెడిశాలలు పెక్కులుంటఁ దా
నేపని కేగ నట్టిపని యెల్లను దీరినమీఁద నైనఁ బో
నోపక నాటకమ్ములను నొప్పుగఁ జూచుచు గానపుంజవుల్
బాపురె! యంచు మెచ్చుచును బాడెడివారలఁ గూడిమాడుచున్. 4

మ. తనయూరిన్ దనయిల్లు వాకిలియు నాత్మప్రియసంపత్తియున్
దనయిల్లాలిని దల్లినిన్ దనదుభృత్యవ్రాతమున్ జిత్తమం
దున నైనన్ దలపోయ కెల్లపుడు సంతోషప్రదుఁ డైన గీ
తనినాదామృతవార్ధిలో మునిఁగి యూఁదన్ జొచ్చె నశ్రాంతమున్. 5

క. గానంపువినికి నెపమున, మానము మర్యాద యనుచు మతి నెంచక యా
యానీచులతో వేశ్యల, నైన గృహమ్ములకు నేగు నహరహ మతఁడున్. 6

మ. ధనవంతుండఁట! రూపవంతుఁడఁట! విద్యావంతుఁ డౌవాఁడఁ టే
ధననారీమణి వానిఁ జూచి మదిలోఁ దాత్పర్యయుక్తిం బూన దై
నను నాతం డొకకొంతకాల మటు గానం బానుచేకాని య
క్కనకాంగీకుచకుంభసంభృతులకుం గాఁడయ్యె లోలాత్ముఁడై.

సీ. "ఇతఁ డబ్బుచో నామునుకకు నెల్లుండికే చేయుంప లేనె! కాంచీకలాప
మతిపురాతన మైనదట్టి నాయిలు మేడ గాకుండునె! యిరండు కన్నెకైన

నీ యుపనాయకుఁడు మాయేణాక్షి నెనసిన మఱునాఁడు గొనవచ్చు మాన్యభూమి
ధనమున కేమి యీతం డొప్పుకొన్నచో నూరక నాకూఁతు నొసఁగుదాన"

తే. గీ. నిట్లు వృద్ధవేశ్యలు తమయొసఁగలందు, "నెవ్వతెవ్వహామ్మ నోచెనో యట్టిభాగ్య
మున" కటంచు మాటికిఁ బ్రశంసను బొనర్ప, దిరుగు నాతఁడు మిత్త్రులఁ దఱచుగూడి.

ఉ. మన్నరికమ్మునన్ వయసుమున్న మేనిపొంకము వేసపుం
జెన్నును గాంచి యెంకయును జిన్నెలు వన్నెలు వొల్చుబోగపుం
గన్నెలు "వీనివంటి యొసకమ్మునఁ బొల్చెడి కోడెకాండ్రు లే
రెన్నఁగ దేనికబ్బునొకొ యిట్టి బొజుంగుఁ గూడు భాగ్యముల్."

ఉ. పాడఁ గొలమ్మునన్ బొడమి పైకమొసంగినవానికెల్లఁ దా
నూడిగముల్ బొనర్చుచు నయోమయమైనమనమ్ము దల్చరో
చేడెల ఫట్టువుల్ ఫలముఁ జెందఁగ నెక్కుడనో యొకండు చే
కూడు కటాళిలోఁ గొలము గొప్పసిరుల్ గలయిట్టివాఁ డొగిన్. 10

సీ. గానమ్మునం దింత కాంతుఁ గల్గిన వాని కేల లేకుండుఁబో! యింతులందు
లేకేమి యీ లేమలీల లాతని మదియందు నచ్చెనో యెట్లు లరయవచ్చు
ముందేమొ కాని యేపూవుఁబోఁడికిని నిప్పటికిఁ జిక్కుటంచుఁ బలుకరాదు
గానాభినయము లాకాంక్షించినంతనే వ్యభిచారి యనుటయు వలనుపడదు

తే. గీ. ఇల్లలికినంతనే పండు వెట్టులగును? నావగింజను నరభాగ మైనఁ గాదు
విందుమో కందుమో వీనివిధము నేఁట, రేపటను, డాఁగునే! లంజెకాఁపురములు.

వ. అనుచుఁ బ్రసంగించుకొనుచుండురఁట. ఇది యిట్టులుండ,

చ. "నిను మదిఁగోరి యుంటి నిదినిక్కము నమ్ము" మటంచు నెన్నిగా
తినమదికోరికల్ మృదుపదమ్ములతోడ లిఖించి యంతలో
నన తెలివొంది "యేకొలము నాతికి నియ్యది గొప్పతప్పు దా
నను జెడఁబుట్టి రిక్కలమునం గల యంగన లిట్టిపట్టునన్" 12

ఉ. నా కితఁడే వశుండయిన నాకొలపుం గొనముల్ త్యజించి యీ
పోకడలెల్లఁ బోకడచి భూఁలుకాలిబుణమ్ము దీర్చుచున్
రాఁకలు పోఁకలున్ మఱచి రాణిగఁ దద్గృహమందు నుండు నీ
శాకలి మంగళిన్ దనపు చావునకున్ మది గల్గఁజేయుచున్. 13

ఉ. ఈగతి నుల్కనట్టి తరళేక్షణయున్ మది నుల్కి యాతనిన్
లోఁగొను నట్టిమార్గమును లోఁ దలపోయుచు చారుగాత్రియున్
సాగ దటంచుఁ జింతిలనిచానయు నొక్కతెయేని లేదఁ టే
రాగము లేనివాని ననురాగము గాంచరె? యొక్కపట్టునన్. 14

ఉ. అం దొకసుందరాంగి జలజాక్షి యనన్ జనువన్నెలాఁడి తా
నెందు స్వవిద్యలందుఁ గడు నెన్నిక గాంచిన యెమ్మెలాఁడి వా
నిం దననీధి నేరుతటి నిక్కగ నుంగొని లోఁగొనంగ నెం
చెం దననీచజన్మ మది శ్రేష్ఠత కాకరమై చెలంగఁగన్. 15

తే గీ. ఎంచి తనమదిలోన యోజించి తనకుఁ, దగినమేటియుపాయ మొకటిని జాణ
గానఁ దనకెంతయునురక్తుఁడైనయొక్క, విటునితో మంతనమునఁ దానిటులుపలికె.

ఉ. కన్నెఱికమ్ము గాకమును కామ మొకించుక లేనియప్పుడే
పిన్నతనమ్మునన్ మిగులఁ బెంకితనమ్ములరారునన్ను లోఁ
గొన్నవిటాగ్రగణ్యుఁడవు కోటు లొసంగియు నాఋణమ్ము, నీ
వెన్నఁడు దీర్పనేర విటు లెవ్వతె నిన్ను గణించుఁ? జెప్పుమీ. 17

క. నగలా! నాణెములా! యే, తగలాఁడికి నైనఁ గాని తలఁపు నిలుమనే?
మగవారికన్న హీననె?, నగరే? నను వారెలమ్మునం గలకన్నెల్. 18

ఉ. పిన్నటనాఁట నన్నుఁ గొని పెంచినతల్లి ఋణమ్ము దీర్చితో!
కన్నెఱికమ్మునాఁడె నొకకాసును గొంగునఁ గట్టనేర్చితో!
వన్నెలుఁ జిన్నెలున్ గలుగ వచ్చెనె? భాగ్యము లేర కాఁడ! ని
న్నెన్నఁ బనేమి? వాదుమననే కనుమొత్తెని దెన్నిభంగులన్. 19

ఉ. తల్లియుఁ దల్లితల్లియును దజ్జననీత్రియు నెన్నికొంపలో
గుల్లలుచేసి గుట్ట లిడికొన్నధన మ్మది యెల్ల నల్లముం
బెల్లముగాక నీకతన వెల్లగ డొల్లఁగఁజొచ్చె నింతకున్
దల్లికిఁ గాని పోకిళులఁ దాఁ జను తోఁచలి పేరు దెచ్చెనే. 20

శా. "అమ్మా! ఱంకుమగండు నీపురుషు డా నాకంతయున్ దల్పఁడే
నమ్మం బోకుము రాజునైన నొరు నైనం గాని నీచేతిలోఁ
సొమ్ముం బెట్టినవాఁడు దక్క మొగమున్ జూపెట్టకే" యంచు నే
ర్పు మ్మాయల్, చెవి నిల్లు గట్టుకొని పోరెన్, దల్లి నిచ్ఛాపఁగన్. 21

ఉ. అయిన నదేమొ నీ కనిన నావల వేలకువేలు వచ్చినన్
గాని వృథాప్రియాళు మిటఁ గన్పడినన్ మన మింద చచ్చుఁ బో
నీ సెల కొక్కరూపికయు నీ విడనెంచ విఁకెన్ని నాళ్ళు ని
న్నాని చరింతుఁ? దల్లియును నున్నకుటుంబము దిట్టిపోయఁగన్. 22

ఉ. ఈపురిలోని మాకులమునింతులయం దొకవిద్దెఁ గాదునూ!
రూపమునందు నేరుపున రూఢిగ నా కెనయైన చాన నీ
వే పరికింపు మందఱును వేలకువేలు ధనమ్ము గూర్చి రే
నే పదనైతి నీకతన, నీవును రా విఁకఁ గొన్ని నాళ్ళకున్. 23

తే. గీ. జనని నానంద మొనరింపఁ జాలనైతిఁ, గొలమువారలలోఁ బెద్దకూళ నైతి
పేలనై సరివారలఁ బోలనైతి, నేల వేయును? నీకె యిల్లాలినైతి. 24

చ. ఇతరకులమ్ము కం బొడమునింతులఁ జిన్నటినాఁడ తెచ్చి పెం
చి తగిన విద్దె బుద్ధియును జెప్పియు నొండొకజాతిపుర్వ ఝుం
కృతుల నకుల్ స్వజాతి నలరించినభంగిని పానిఁ జేయ నా
సతి తమ కర్త దేఁతయును సానులకున్ దలవంపు నింపుచున్. 25

చ. అనుచు నొకప్పుడున్ వినని యప్పలుకుల్ చెవి సోఁకినంత న
వ్వానితకు దానుఁడైన విటవల్లభుఁ డ్లన గుండె జల్లనన్
గన లుపయింప నాఁచికొని కా దని యౌ నని పల్కలేక లో
వనకొని నిట్లు "ఛీ! పడపుతుంగన లిట్టిర" యోసినయున్. 26

చ. ననుఁ గనికాని భోజన మొనర్చను నవ్విటకాని యన్యయున్
విన దొకవేళనైన నను వీడి యొఱుంగదు గర్వ మన్న మా
టన విన రాదు దీనిహృదయం బిపు డెంతట్రిలోన మారెం, "గో
వనితల పేర్మికల్ల" యనువార్త లసత్యము లెట్టులౌ? భువిన్.

చ. జనని యొనర్చుబోధములచందము దాఁ దుల కెక్కి యుండునా?
తనచెలికత్తియల్ సలుప్రతంత్రము లాత్మఁ గలంచి యుండునా?

ననుఁ దలఁదాఁటు నింక నొకనాయకునిన్ వరియించి యుందువా!
కనికర మింతలేక యిటు కాలుఁ బ్రేలుట కేమిహేతువో. 28

చ. తనపసిప్రాయమందు నిటు దైవముగాఁ గనునవ్వెలందియే
చనఁ జన మోటువాతి యొకచందమునన్ గనుఁ జాల్కుఁజాచు లోం
గినకొలఁదిన్ మతిం తఁ దణకించును నేవకుకన్న హీనుఁ గాఁ
గను నిది తుచ్ఛజాతులకుఁ గాక మఱొక్కఁటఁ గల్గ నేర్చునే. 29

వ. అని యచ్చెలి నుద్దేశించి.

తే. గీ. అడిగినను తమ్ము దర్శ్యమ్ము లమ్ముకొన్న, రాకపోవునె? మర్యాద రాదుగాని
మగువ! "యేడ్చినదానికి మగఁడువచ్చి, యేసులాడినదానికి రాకపోఁడు."

తే. గీ. మొదలఁ దా నెంతచేసినఁ దుదకునొక్క, మాటతో నదియెల్లను మట్టుపడును
వినవె? యీసామెతనునీవు వనజనయన! "నూఱునోములు ఒంకనోఁ దీఱిపోవె" 31

చ. తన మనుమాట వేశ్య యను దానికిఁ దోఁచన నీడపోలె నుం
డినయదియే, తగుంగతి గడింపవలెన్ సమయమ్ము మావి, యీ
నిశయపు డాపు పాలిడదె? నీటి నొసంగదె? వర్ష కాలమం
దున జలదమ్ము. లింత మదిఁ దోఁచని దానికిఁ జెప్పనేటికిన్. 32

క. అన జలజాక్షియు మోమున, మునునగవు సెలంగ నోయనుంగుబాలుంగా!
నిను తన మమ్మ మటుస వెన్క్షినె? యెక్కడఁదెత్తు? వది, యెఱింగింపు మొగిన్. 33

వ. ఇట్టిపట్టునఁ గృష్ణునకు నొక గొల్లచేడియ చెప్పిన సమాధానమ్ము గల దా
కర్ణింపుము. 34

మ. జనన మ్మాదిగఁ బొట్టనించితివి గా! చౌర్యమ్మె కార్యమ్ము గా
తన మొక్కంతయు నీయకే పరసతీదాంపత్యముల్ గొన్న నీ
జననంబుల్ పదికోటు లీబులు షమ్ము దీర్చన్నేర్చునే? యట్టి, నీ
కును నేమున్నది? యేమొసంగెద? వహో! గోపాలచూడామణీ. 35

వ. అని యాజలజాక్షి యతనికిఁ గొంతబుజ్జగించి మఱియును. 36

మ. త్తకోకిల గాన మిక్ మిన్నచేతఁ గొందఱఁ గన్నెలన్ వలపించి యా
పైని జాట్యమటుంచుఁ గొందఱి ఖాలలన్ గికురించి పోయిన్

మానవాణకళాప్రవీణతఁ జూపి కొందఱిఁ బ్రోదలన్
మానభంగ మొనర్చునీవును మా కొసంగెడి దేమిటో. 37

ఉ. కావున నిన్ను నేను ధనకాంక్షమెయిన్ జననాఁటనుండియున్
బూవిలుకానిముచ్చటలఁ బొందఁగ తే దిది నిక్కువంబు, నే
నేవిధినైన జన్మ మిది యెంతకునుండునో యంతవట్టు నీ
తో విడకుండుటే నిజము తొంబదివిఘ్నము లిందు వచ్చినన్. 38

క. మనచెలిమికి భంగ మ్మొందును గల్గకయుండునట్టి తోవను ద్రవ్యం
బును గాంక్షింపఁగవలె నేమన! ద్రవ్యము లేమి నెట్టులగుఁ బోషణముల్. 39

ఆ. వె. "కూరుచుండి తినిన గుళ్లుగోపురములు, నాట" వెన్నివాళ్ల కగును నింట
నున్న ద్రవ్య మింక నొండొక్కసమపాలు, మెద్దియేనిఁ జూచుటే హితంబు. 40

క. ధన మెంత నీవొసంగిన, గొన నది యేమంటివేని? గూఢమ్మగు వ
ర్తన గల్గుప్రియునిపై మన, మెనసినగతి నుంచుకొనిన నెనయూదు వింటే. 41

ఉ. ఎంతధన మ్మొసంగినను నెన్నివగల్ మెయినిండ వైచినన్
గాంతుఁ డొకండు వేఱొకఁడు గావలె నిష్టుఁడు రోవెలండి, కీ
యింతుల మర్మకర్మము లొకింత యెఱుంగ రహా! జమీను దా
ర్లంతిపురమ్ములం దిడుదు రందుకు మానవు మాప్రవర్తనల్. 42

గీ. అభినయమటంచునో గానమనియొ వైద్యమనియొ మఱియెద్దియోరామిష యౌవనపుపటబి
తనరుఁ బ్రియుఁడగువాని నంతఃపురమున, కళ్లెమమ్మున రప్పింతు రజ్ఞముఖులు. 43

క. అది యేమికర్మమో తొం,బదిలక్ష లొసంగనేని మదనుండేనన్
గుదురదుమన మిక్కొంతల, కద నెఱిఁగినయట్టివిటునియందుం బోలెన్. 44

మ. ఇదియే నిక్కము గాకయున్న వినుమీ వీయూరనే కాదు తొం
బదియూళ్లన్ గనఁగొమ్మ ద్రవ్యహితుల్ మాజాతి పూఁబోణులన్
బదిల మ్మాగతి నుంచుకొంటయును నప్పద్మాక్షు లింకొక్కనిన్
గదిసన్ దూతిక నంపి తెప్పుకొనుటే గన్పట్టు నీ కల్లెడన్. 45

ఉ. కొందఱువెఱ్ఱు లయ్యెడలఁ గొండొకమానిసి ద్వారమందుఁ గా
పుం దగుజీత మిచ్చి యిడిపోదురు వానికొకింత యిచ్చినన్

జిందనఁ గదికిఁ బిటునిఁ జయ్యన వాఁ డొనఁగూర్పఁ గొన్నిచో
ట్లుం దగ వాఁడె యా విటుఁడు, లంజెలనైజము లెన్న నేట్రికిన్. 46

ఉ. నమ్మవుగాని నీకు నొకనాతిచమత్కృతి చెప్పెదాన మా
యమ్మను గావలెన్గల మృగేక్షణ నాథుఁడు శయ్య నుండఁగా
నమ్మక చెల్లి! యింకొకని నచ్చలు నేరతిఁ దేల్చె నిద్ర నోఁ
దమ్మహితుండు దీపమును నా యది కాంతల కెంత లిప్సనుల్. 47

చ. ఒకవెలచానలేయనుచు నూహ యొనర్పకు స్త్రీలజాతికే
సుకరము మాయ యందు వెలసుందరు లిందులకై జనించుటన్
బ్రకటనకెక్కెనేనియును బాధయు నంతగ లేమిఁ జేతు రి
ట్టి కుటిల కృత్యముల్, గటు నటింపఁగఁ జేతురు కీలుబొమ్మగన్. 48

ఉ. నావుడు నాతఁ డిట్లులను నాతిరొ! పిన్నటినాఁటనుండి మీ
రో వెలఁదుల్ పొనర్చు పలురోఁతలు నేను నెఱుంగువాఁడ నీ
వేవిధి బోధచేసెదవొ యేర్పడఁ జెప్పుము ద్రవ్య మాగతం
బౌవల, నద్ది యెట్టిదియునైనఁ బొనర్చెద శంకఁ దక్కుచున్. 49

క. అన జలజాక్షియు మనమునఁ, దనకోరిక సెల్లునని ముదం బందుచు నే
ర్పున నిట్టులనియె దానిన్, సన నేమిటు సర్వోధాత పలిపెన్ బళిరే! 50

చ. అరసితిఁ గాదె! నీ వలయుదారుని, నాతఁడు మేటిసంపదన్
ధరణిపునంతవాఁడఁట యుదారత నామె చెప్పుచుండ నొం
డొరులు వచింపనేల! యతఁ డొక్కకనాఁ డొకనాతియింటి కే
గి రహిని గానమున్ వినెనిఁకీ లది నీవు నెఱుంగ కుందువే. 51

తే. గీ. ఇప్పటికి దేనియందు నపేక్షమ్మెకాని, మదిలగింపమి నిక్కువం బదియు నొక్క
నిముసమున నేను లోఁగొందు నీకు నాతుఁ, దగినద్రవ్యమ్ము నార్జింతు దానఁ జేసి 52

క. కావున నాతనితోఁ జన, వేంతము నైనఁ జేసి యిచ్చోఁడ కతనిన్
రావింపుము తక్కెనపని, నీ వేమియుఁ జేయవలదు నేన యెఱుఁగుదున్. 53

ఆ. వె. ఆతనికగలు గాంచి యామీఁద నీమీఁది, పేర్మి విడతు నంచు భీతి నీకు
లేశమైన వలదు, లేఁబ్రాయమునఁ దగు, లొక్కన్న వాని విడుచుగోల గలదె.

చ. అతఁ డొకవేళ నన్నుఁ దనయంతిపురమ్మున నుండఁజేసి భృ
త్యతతులఁ గాపువెట్టినను దప్పక నాదగు నేర్పుకల్మి నీ
కుతుకము నెట్టులేని సమకూర్చెద వేయును నేల? వాని "నా
ప్పితి" యనిపించెదన్ వలపుఁ బెంచి క్రియమ్మున నీకురాఁకవున్ 55

క. అనవుడు నాతఁడు తనదుమదన మింతమకఁ జేసికొనియు ధన మీలేమిన్
దన కది యీగతికిన్ దక్కినఁ దక్కుఁ దటంచు నెంచి కీలెఱిఁగి యొగిన్. 56

ఆ. వె. అది యకృత్యమగుట నాత్మ నెఱింగియుఁ, దానివలనఁ గలుగుతగులుత్రిప్ప
కొనఁగలేక "వల్లె" యని యొప్పుకొనియె నేఁపనికిఁ దుచ్ఛవిటులు పాలుపడరు? 57

తే. గీ. రాణి నోరఁ గూర్చి మున్ను భళ్ళాణనృపతి
తనసతికిఁ దాన దూతయై చనియె నలుఁడు
పరఁగ నవయఁ బొందఁ డిడె నాజ్ఞ భార్య, కంత
కన్న ఘనుఁడనె? యిది భార్య గాదు నాకు. 58

క. అని మనము సమాధానంబును బొందఁగఁ జేసికొని సుముఖుఁడై మెలమె
ల్లనఁ, జని యొకదినమున ని, ట్లనియె నుదారుఁ గని మైత్రియులసుకతనన్. 59

మ. తమ రీయూరికి వచ్చు కార్యమది సొంతం బాయెనే? యేపనే
మము లీప తనయందుఁ గాంచితిరి? వాస మ్మిచ్చటన్ మీకు స్వా
ఖ్యముగా నున్నదియే? యిటన్ దమరు నింకన్ గొన్ని నాళ్లుందురే?
తమ లేగన్ మము బోఁట్రమిత్రులకుఁ జింతల్ సెప్పఁగా శక్యమే. 60

శా. గావమ్మున్ వినుచుంటి రోఁగద! సమగ్రప్రజ్ఞ యద్దాన నే
మీనాక్షీమణి కొప్పు! నాట్యమున నేమీ? యన్యమందేమి? యే
యేనాళీకముఖుల్ నతింపఁ దగువా రీవీటి? మీవీట్రినో
నీనాట్యాభినయాదికమ్ములవు హాయిన్ జెందువా రందురే? 61

చ. అనవుడు గానమందుఁ గల రంగవ లయ్యేడ నెంద ఱందఱో
యమకృతికైన లేదభినయమ్మున నొక్కతె మాపురమ్మునం
దున, నన నేల? దేశమది దుర్గతిభాజన మొక్కడీనికే
వినికిరొకాని యియ్యెడ వివేకని గన్పడ దందు నెందునన్. 62

ఉ. చామనచాయయున్ మిగులఁ జక్కని చన్గవ లేఁతమోవుల
క్కాముని కైననున్ వికృతి గల్పఁ జేసెడి సోయగమ్ము లీ
లామధురోక్తిచాతురి కలాకలనమ్ము బెడంగుఁ బ్రాయమున్
మోమునొయారమున్ భువనమోహనమై తగు నవ్వెలందికిన్. 73

తే. గీ. పేరు జలజాక్షి యది నేతిబీఱకాయ, గాను జలజమ్ములను దెచ్చి కమలనూతి
తాపనము సేయుశిల్పివిభమ్ము దోఁప, నతికె మోమువననటో క్ష్యక్ష జంబె. 74

గీ. అనను దారుంకువల్కు "నీ ముత్కుగను లె,మున్న సేగన్న యపియు నక్కన్నె కడకు
మనము పోవచ్చునో? గానిపురఁ దేవఁడుగు, బెట్టికొనియుండఁడో? వానికట్టు లేదో?" 75

చ. అన నతఁ డిట్లు పల్కు "నది యాకొలమందుఁ బుట్టఁ దగ్గ జ
క్వా యని యెంచఁబోకుఁడు ధ్రువమ్ముగఁ బూరుగుఁతోఁటలోని చం
దనలతయున్ గలంజప్రవనమ్మున నౌతులసీమతల్లి, దా
నినదత చందమున్ వినుతు నిక్కము మీమన మక్కజంపడన్. 76

ఉ. కన్నెతిక మ్మొకానొకఁడు గైకొనె, వాని యదృష్ట మెట్టిదో
చెన్నఁటి వాదుతప్పు నలచేడియ రెమ్మ్వా వాఁడెయింగఁ దా
దిన్నియొమారి యాపయిని పీ! యని యెందులకో విరక్తిలోఁ
గొన్నదివో లెఁ గైకొనదు కోటు లొసంగెడివాఁడు వచ్చినన్. 77

ఉ. దానికిఁ బ్రాయ మిట్టెడల దగ్గరదగ్గర నిర్వదేఁడు లే
మానిని యుండు నిట్ట్రిక్రియ మానవలోకమునందుఁ? దన్మనం
బేనరనాథనూత్నపయి నేర్పడియుండెనొ? యెంతకోస మీ
మానము తాల్చెనో? యొయలమానస మేగతిఁ గానవచ్చెడిన్. 78

సీ. ప్రాగ్వరీతిగాఁ బద్యమ్ములను వ్రాసి "వ్రాయుమీ? యా" బంపుఁ బంపువారు
యుత్తరమ్మును వ్రాయ కుండి యెచ్చటనైనఁ గనుపడ్డఁ "గరుణ లే" దనెడివారు
లేనిపోనిపని గల్పించుక యింటిముట్టును బడి తిరుగాడి చనెడివారు
అంగీకరింప లే దనెడికోపముచేత గోడకుఁ గాకితాల్ గొట్టువారు

తే. గీ. ఇంటిపై బెడ్డలను వైచి యేగువారు, గొట్టవలెనంచు లోలోన గొణుగువారు
నై కుదకు దానిపొందుఁ దామందలేక, విసివి వదలిరి యాజోలి విట్రవిటులు. 79

మ. ఎవనిన్ ధన్యునిఁ జేయనున్న దియొ? తా నెవ్వాని తారుణ్యమున్
గవివర్ణ్యం బొనరింపనున్న దియొ? యే కాంతాశిరోరత్నమున్

పవిత్రాత్మ యుడికింపనున్నదియొ! యేసాఙ్క్షు సంసారసా
రవిహీనత్వము వాప నున్నదియొ? నేరం బోల దూహింపఁగన్. 80

క. అనవుడుఁ "దాదృశగుణగణ, ఖనిఁ గనుఁగొనుటయును గొంత గణనీయమె నీ
వెనువెంట నెప్పుడేనియుఁ, జనుదెంచెదఁ దెల్ప దగిన సమయ" మ్మనుడున్. 81

క. "కనుఁగొని తెల్పెద" నని యా, జవరాచకుఁ డరిగె దానిచక్కఁదనము నె
మ్మనమున నాటుకతన నూ, తనమాంద్య మ్మయ్యె వారదరి కరుదెంచెన్. 82

క. దానియిలు సేరిన ట్లు, ద్దానిన్ గనుఁగొనినయట్లు దానిచతురతన్
దా నోడినట్లు మనమున, దానింగను దానినెంచు దానినుతించున్. 83

తే. గీ. మనుపువినినప్పుడే కొంతమొలకగనిన, వానియనురాగవృక్ష మివ్వానికతన
నిక్రమ తిరిగియు వింటచే నెదిగి వింత, సరణి నొక్కింత శాఖోపశాఖలలమె. 84

వ. అట్టిగొమెడ నింతకుమున్ను జలజాక్షిఁగుతించి ప్రశంసించినవాచకున కొక్కింత శత్రు
తగు వతియొక్క విటుం డిట్లను. 85

తే. గీ. ఎవనితో నెన్నఁడేనిఁ దన్నింతకంత, యనుగతున్న ప్రమంచియేయగును గాక
చెట్టయగుఁగాక తనయంతఁ జెప్పఁబోవఁగు, వానికన్నను బేల యెవ్వఁడైనఁగలఁడె?

క. అయినను మీశ్రేయస్సు ప్ర, ధానముగాఁ గోర మీదుతలఁ పెక్కంగా
నా నేర్చినంతలో మీ, కేనొకసంగతిని జెప్ప నెంచితని జూఁడీ. 87

క. ఇటువ ర్తనలోఁ జిన్న, ప్పటునుండియుఁ దిరిగి దానఁ బడుపాటుల నొ
క్కటి రెండుమ దక్కక రెటిగిన, పటుమతి నని నన్నె లుంగవలయును మీరల్.

క. విధవల నేకులు గల, "రా, విధవలలో మొట్టమొదట విధవ యెవఁడు?" నా
నధమప్రవేశ్యలఁ గూడెనీ, విధవయొ! నాయనుభవమున వినిచెదఁ జూఁడీ. 89

క. ప్రేమ మొకించుక లేకయె, కామము గలవనితవలెనె కామునకై తా
నోమనుకున్నైనఁ గూడెడి, సామాన్యం గూడు వానిజన్మము ఘనమే? 90

తే. గీ. ఇహాపరమ్ములనెఱుఁగని హీనమతులు, కష్టసుఖములనెఱుఁగని కఠినమతులు
మానమర్యాదలెఱుఁగనిమందమతులు, తక్కువేలవేఁదులపొంతు దలఁపరెందు.

ఉ. దండుగదోహమలో సకలధర్మములున్ విడనాడి బోగపున్
ముండలతోడఁ బోవుటకు బుద్ధిని బ్రేరణ చేయుచున్న యా
గండలకొడ్క దానికి సరాసరిగా ధన మీయకున్న బ్రి
హ్మండము మగ్గిపోయినటు లాఘయిపేద్దురు సర్వశూన్యలై.

ఆ. వె. ఉండఁ గొంపలేక, పండఁ బానుపులేక, మండకిచ్చుటకును మనుపు లేక
మొండితనమూని దండివార మటంచు, బండవిటులు దిరుగుచుండఁ గనమె.

శా. వేసాలన్ ప్రచరించినన్ మనము తృప్తిం జెందఁగాఁ బోదు వ్య
త్యాసమ్ముల్ ప్రబలించు బుద్ధి చెడు నాయాసమ్ము మెండౌను వి
శ్వాసమ్మున్ జెడిపోవుఁ గోప మొదవున్ వాంఛల్ తుదల్ముట్ట వీ
స్త్రీసాంగత్యమునకన్నఁ బాడుపని వేఱులేదు చర్చింపఁగన్. 94

శా. వైకుంఠమ్మయి శంభులోకమయి దేవశ్రేష్ఠనావాసమై
నాకంబై నరలోకమై నరకమై నానాఁటికిం దోఁచు నీ
రాకాచంద్రముఖీసమాగమమునన్ శాస్త్రజ్ఞతల్ వోలె సు
శ్లోకుల్ పండితులున్ భ్రమింతు రిది యిక్షుపాత్రియ మూహింపఁగన్. 95

తే. గీ. మొదలసంసారమే కడుమోహమయము, గాన దానికె యొప్పరఖండమతులు
దానిలో లంజెవలని యిందైనసుఖము, చెప్పనా? శత్రునరును నీచేటు వలదు.

క. తలిదండ్రులు మోదింతురొ! కులమానను బ్రతిష్ఠగలదొ? కులకామిని లో
వలపటు గాంచదొ? యేమిటఁ, గలుగున్ సౌఖ్యమ్ము లంజెకాఁపురమందున్!

క. తనువు చెడు మానమడఁగున్, ధనముడుగున్ బుద్ధిఁ దనకు దవ్వగుఁ బాప
మ్మును నబ్బు జూద మెనయున్, ధనకాంతలు నేర్పనట్టి తప్పులు గలవే? 98

క. "మనతలన పుట్టెనే? యిప్పను" లని యొకవేళ మీరు ప్రశ్నింతురు, కై
కొనవలె నటులేనియుఁ దాఁ, దనకన్నన్ జిన్నదానిఁ దగియెడివానిన్.

క. "వచ్చెదను రానిమ్చయములను, వచ్చెదరాఁట్టి ముద్దుబాలురపలుకుల్
హెచ్చగు మోదమునిచ్చును" నచ్చును రసికులకు నవియె నవనవగరిమన్.

క. ఒఱఁగినచనుఁగవ గలిగిన, తరుణింగవగూడుకన్నఁ దఱచై కడుఁ గ్రి
క్కిఱిసినచనుఁగవ గలిగిన, తరుణులపదతాడనము శతగుణము మెఱుఁగౌ.

ఉ. గిల్లినఁ బాలు గాటుకలికిన్ గరఁగూడిన సౌఖ్య మబ్బఁ గా
కెల్లెట్రాఁగ్రి ణ్యులును నెత్తరతత్తర చేసినట్టి యా
యుల్లసిబోట్లఁ గూడ సుఖ మబ్బునె? మాటలతేట దక్క మీ
యుల్లమునందుఁ జూచికొనుఁ డూరకవాఁగెడివాఁడఁ గాఁడుఁడీ. 102

ఉ. "పున్నమనాఁటి చందురునిపోడిమి మంచిది గా" దటంచు నే
నెన్నఁడుగాని పల్క నిఁక నేఘన? నద్ది క్రమక్రమమ్ముగా

సన్నగిలుఁ, ద్వితీయ నగుచంద్రుఁ డన్నఁ! గ్రియక్రియమ్ముగా
నున్నతిఁ జెందు భేద మిదియొక్కటి పొందఁదగున్న దోషముల్. 108

తే. గీ. అందులో మీర తెద్దానిఁ బొందు నేయు, నెంచుమంటిరో యదియుఁ మీకీడుగాదు
దానికుపకార మొనరించుతలఁపుఁ గలిగి, వాఁడటులు సెప్పె నీనాఁటి వనిత యిదియుఁ.

తే. గీ. ఇపుడు మీతోడఁ జెప్పిన యాప్రబుద్ధుఁ, డేమి నివ్వన్నెలాఁడికి వలపుమగఁడు
పేరుగుర్చ్చంగ నేల? యీయమ్మ దీనిఁ, జూడనున్నట్టివార లెవ్వరు లేరు.

క. ధనవాంఛలేకయే యివ్వనితామణి యీసువమ్మునకే నిటులన్
గని పిల్చి కూడఁ జొచ్చెను, దన కొలమున కన్నె లెల్లఁ దను నవ్వంగన్.

ఆ. వె. "మాఱుమనువు దానిఁ జేరంగఁ దీసిన, మొదటిమగని సోదె మొదలఁబెట్టె"
నన్నరీతి నిది రసాభాస, మందును, నెక్కుడనుచు మీర లెఱుఁగవలయు.

క. చాతుర్మాస్యములలో యతు, లేతీరున బొంకెదరో యదే తీరున వే
శ్యాతరుణులు వయసు గడుగన్, దాఁతురు; తలక్రిందుమాడఁ దగు నట నిచటన్.

ఆ. వె. తనకుఁ బెద్దయైనతరుణితోఁ గూడుట, యాయమ వణఁగఁ జేయుటట్లుండ
"దాని కేటివినితగు! లేదకే?" యంచు, నగుదు రెల్లవారు నగడు చేసి.

తే. గీ. కడఁగి "కడవంతగుమ్మడికాయ కత్తి, పీటకగు లోఁకు" వనియట్టి పోటి నొప్పు
టొప్పిదంబేని యీను దీని నొప్పబోకుఁ, డింతకన్నను జపలురా లెందులేదు.

క. అన నతఁడిట్లను "నేమమ్ములను గలవే?" చెప్పవచ్చు లోఁబడియెడి య
జ్ఞనులు దొరకగ వేశ్యా, జనులకుఁ గలదోసఁగు లితరజనులకు లేవే? 111

తే. గీ. దేనియందైన ననుభూతి దీఱుపిదప, దాని నిరసించువాండెంత జ్ఞానిగాఁడు
మొట్టమొదటను నిరసించు నట్టివాని, నెన్నఁగాఁదగు వారలు నున్న జగతి.

క. అనిపలుక నాతఁ డంతటఁ, జనియె మదారుఁ డిటులోఁ జర్చించె "నొకం
డను మోదించినవస్తువు, జనుఁ డింకొకఁ డొప్పఁడిదియు సహజం బెందున్. 113

క. చంద్రుకాంతిం గని లో, నెందఱు సంతోష మందరె? యెయ్యెడలను దా
మందురె? పంకజములు, జగమందతికిన్ ముద మొసంగునది లేదెందున్.

ఉ. దాని పవిత్రతన్ గుఱించి తద్దయు నాతఁడు నచ్చఁ జెప్పిన
స్వైరము నైన నయ్యతివ యేలికొనన్ గమకింప దన్నమా
టే నిజ, మక్కటమ్మునన యాతని కాతరుణీవశంసమం
దూనెనుమాయు, నిక్కమది యొక్కఁడు నెప్పుడిబుద్ధు లొప్పునే? 115

ఆ. వె. దాని వినినదాది తన్మయుండయి చిత్తవృత్తి విస్మృతాన్యవృత్తి యయ్యెఁ
గనిన యప్పు డేమి గనున్నదో, బుద్ధి కర్మ మనుసరించుఁ గాదె! యెందు. 116

సీ. కాంతలతోఁ బొందఁ గారామి సక్రమా! యటులైన నేల పెండ్లాడవలయు ?
అన్యకాంతలఁ గూడు టనుచితం బందుమా! యటులైన నిదియుఁ గా దన్యకాంత
వెలయాండ్రి చెల్మి తప్పిదమౌనటందుమా! యటులైన వీండ్రెందు కవనియందు ?
సత్కులీనులకు నాచారంబు గా దందుమా! యింతలోన నేమౌఁ గులమ్ము ?

తే. గీ. కలియుగమ్మున నీరీతి కట్టుబాటు, గాని మున్ను శకుంతల గాదె? వేశ్య
యాపెఁ గొన్న దుష్యంతున కందునింద, నేమి లోపమ్ము గల్గె? నందేటి శంక?

చ. పలువుర నొక్కచేడియఁ బొల్పడు టొప్పుగాని నేమముఁ
వెలసెడి యట్టియుగ్మలిని వీధిమొగమ్ము గనంగనీక తాఁ
గులసతిఁబోలె నుంచుకొనఁ గూడదె? దీన మదేమిలోపమా?
గలిమికి నెందునుఁ ఫలము గాదె? మహోన్నతభోగభాగ్యముల్. 118

ఉ. భోగమునందు నిచ్చలును బొందనివారిల లేరు దానికిన్
భాగ్యము ముఖ్య, మందులకు ద్రవ్యము గావలె దానిలేమి న
య్యాగమవేత్త లీసుఖము నందఁగలేక స్వరీతి నెల్లకున్
భోగవిహీనులన్ సలుపఁ బొత్తము లీక్రియ వ్రాసి రీసునన్. 119

క. ఒకని ధనమౌటచేఁ బర, వికచాంభోజాక్షి నెనయుటవిధ మది దోసం
బింక సకలజనులకును దా, నొకరతి ధనమగుట వేశ్య నొందందగదే. 120

క. ధననాశనతఃనాశన, ఘనతానాశనము లిందుఁ గలుగుట ధ్రువమై
నను నెల్లరకును నయ్యవి, పనుపడు ననరాదు భాగ్యశాలియగుకతనన్. 121

తే. గీ. ఎందుఁ జేసియు సందియ మెన్నఁ దుకుండ, మనుజుఁడు పవిత్రత్వమ్ము గొనఁగవలయుఁ
గాని దీర్ఘయోజన కొఱగాదు "సంశ, యాత్మ వినశియించు" నని పెద్ద లంద్రుగాదె.

ఉ. సారవిహీనమైన భవసాగరమందుఁ గురంగలోచనల్
సారము, తెల్వితేటలను జాణతనమ్మున నందుముఖ్య మీ
తీరు స్వతంత్రలైన సుదతీమణులందుఁ బొసంగు, వారు శ్రీ
హారిణులంచు మానుకొనఁ జాతురి యింతయుఁ జూడఁ గల్గెడిన్. 122

ఆ. వె. దొసఁగులెన్ని యేని బొసఁగుఁ గాకెందును, గలలఁ గానవిద్య కన్న లేదు
అంగనాజనమ్మునందు రూపాజీవ, కన్న ఘనము దనుపుకన్న నున్న.

చ. అదియునుఁగాక వస్తుగుణ మారయ నెంచిన జేసికొందు నె
య్యది సహజంబొ దానిఁ గనవౌనటు, వేఱొకచోటు నించుమిం
చు దనరు నట్టిసంగతియె చొప్పడినన్ సహజప్రకారమై
యొదవమిఁ దెచ్చిపెట్టినటు లుండకమానద దెన్నిభంగులన్. 124

క. ఆమనిఁబోడము రసాలము, తో మతియొక ఋతువునందుఁ దోఁపదనవియు తా
నామధురిమ మిడ సేరదు, హా! మహి నది మేనమామపోలిక యగుటన్. 125

క. ఇటు పలువిధముల యోజిం, పుటు ప్రారంభించునంత మొట్టమొదటి య
ప్పిటుః దేగదెంచి "యటుకే, గటు రే" యని చెప్పుటు నుం రఘులోన్నుకొన్రెన్.

తే. గీ. అందులకె సిద్ధమైయుంటి నగఁడుదల్లె, యనియె నటకమునఁ గుమనవు గదెంచె
నర్మసఖుతోడఁగూడి యనాథమిన్న, సదనమునకేగ నభినయాసక్తి నతఁడు. 127

గద్య.

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం
బైన పాణిగృహీతయందు
ద్వితీయాశ్వాసము.



# పాణిగృహీత.

## తృతీయాశ్వాసము.



సరసతర, రుచిరగీత,
స్వరసాదర లక్ష్మణాగ్రజన్మగృహీతా
గురుతర భాగ్యసమేతా,
చిరకీర్తిప్రాప్తిధామ సీతారామా.

తే. గీ. అవధరింపు మనంతరం బాలతాంగి, యొప్పుకుచుగనుమాయకరయెసక మెసఁగు
తనదుదేహమ్ము గేహమ్ముఁ దదధికముగు, సొంపుగులుకనలంకృతుల్ చొనిపిపప. 2

క. తత్తదుపాంగమ్ముల న, త్యుత్తమగతినలవరించి యొక్కెడఁ దదా
యత్తమ్మగుచిత్తమ్మున, నత్తరుణి గవాక్షనిహిత మగుమా పొలయన్. 3

తే. గీ. ఎదురుచూచుచు నున్నంత నిరుపురచటి, కేగి రేగుటయును దరుణేందువదన
దవ్వులన కాంచి కేళీసదనములోని, కంతలోఁ జనె సిగ్గున్న యబల వోలె. 4

తే. గీ. అర్యువాయని వొక యుచితాసనమున, నుండఁగాఁజేసి సర్మసఖుండు లోని
కరిగి "యిదియేమిపాప మోయబల! యతని, దీసికొనివచ్చినప్పు డీరీతి తగునె?" 5

వ. అన నాటుక్కరికరిగమన యతని కిట్లను.

ఉ. దూరమునందు నున్న యెడఁ దోయజనేత్రల కెంతయేని వా
గ్ధోరణి యుప్పతిల్లు మదిఁ గొంకొకయించుకయున్ జనింప దా
ధీరతయున్ గభీరతయుఁ దెంపును బెంపును దగ్గ్రైన య
ప్పూరుషుమోము గన్గొనినఁ బోవు నదెంతటి ప్రౌఢకేనియున్. 6

క. నమ్మెదవో లేదో యాతని, నెమ్మొగముం గనినయంత నే మదిలో నో
క్కమ్మడిగ లజ్జ వొడమెన్, జిమ్మన నది వదలిచనదు చేవదగులుటన్. 7

క. పనితనమునుండి నన్నున్, గునుమశరవిహారములఁ దగుల్కొల్పినసీ
దు సమీపమ్మున నితనిన్, దెస మొగమెటు త్రిప్పి నిలువఁ జేఁకువగలుగున్. 8

క. పలువురప్రియురాండ్రొక్కటు, గలసభఁ బురుషుండు నిలువఁగలఁ డదిరసమున్
దొలఁగింపదు కామినులటు, నిలుచుటకున్ దగదు రసము నీరసము నగున్. 9

వ. అను నక్కలికి పరిసంగమ్మున కడ్డుగా నతం డిట్లను.

క. అతఁ డపటు నే నిచటు నుం, టి తగదు నే నెఱుఁగనట్టి టుక్కరితనమా?
యతివ! యిది, సిగ్గు మీ జాతి తరుణులకు నున్న యంత తెల్లం బెన్నన్. 10

తే. గీ. అని యఖండమగుటయు నత్యుత్తమమిన్న, యల్లనల్లన వాయించునట్టియెడను
వరిగి చుట్టుఁ గంబ మొక్కింతయడ్డుగాఁగ, నోరగానిల్చి కాంచుచునుండునంత.

క. తనమది నద్దానినిఁ గనుఁ, గొను టెప్పుడటంచుఁ గోర్కె గుబ్బతిలఁగఁ జిం
తనసేయు నయ్యుదారుఁడు, వనితబెడంగంతఁ గాంచి వహ్వారె! యనుచున్. 12

తే. గీ. మెచ్చి "యిచ్చపలాక్షి నా మేడనుంచ, నేర్చితినయేని నాదు వన్నెయునువాసి
కలుగు జన్మవ మిది సార్థకత్వమందుఁ, గలిమిగలుగుటకును సుంతగలుగు ఫలము. 13

క. తగు కాంతతోడఁ బొందున్, దగులని మనుజునకునైన ధనధాన్యమ్ముల్
సొగసును జాణతనమ్మును, భువద్వ్యాంచితము లధికపాపాస్పదముల్. 14

ఉ. ఈతరుణీమణిన్ గలసి యించుక భేదము లేక యుండఁ దా
నేతరుణుండు కామకల లెప్పుడు చింతనసేయుచున్ లస
ద్గీతవినోదముల్ గనుచుఁ గేల మోదమయాత్ముఁడై వసు
స్స్ఫూర్తికి సార్థకత్వ మొదవించునో వాఁడుగదా! కృతార్థుఁ డౌ." 15

క. అని యూహసేయు వానిన్, బనరాలోకన మొనర్చి మరియు మచ్చియు న
వ్వనిత కిలపాటి లే దని తనలో, నానందమందుఁ దనియు నెడందన్. 16

తే. గీ. అట్టియెడ నర్మసఖుఁడిట్టు లను "జగాన, నభినయమ్మున నీపాటి యుండకత్తె
గానఁగారాదు గానమ్ముఁ గవసకత్తె, దానికిన్ దోడు దీని కేతరుణి లేదు?

క. ఎదుటన్ జెప్పిన నతిరుని, మది నమ్మనతికిఁ దోఁచు మాటలిఁకేలా?
గుదిగూర్చె నన్ని సంగతు, లిది తావుగ నెంచి ధాత యింపెసలారన్. 18

క. అని జలజాక్షిం గనుఁగొని "వనబోణిరొ! సిగ్గు వారనాతికిఁ దగునే?
కనుఁగొన వచ్చినవారల, మనమెక్కన్ మెలఁగకుంట మరియాదటవే? 19

క. సిగ్గుగల వారకాంతయు నసి, గ్గగల కులాంగనయును జెడుదురు నీవీ
యొగ్గెఱుఁగ నేర విది యొక, పెగ్గ యనుచు గునిసె దిండుఁ బెంపుగలుగునే. 20

తే. "సగముచచ్చి యంతయుఁజచ్చి జగతిగాన, హాస్యములు నేర్చికొనవలె" నందు రందు
నభినయమ్మునట్టిన యదియుఁగల్గి, యంతసిగ్గునఁ దేజను నె? రోయిగురుబోణి. 21

క. నీ తెలివితేటలను సం, గీతాభినయప్రసక్తికిన్ గైతకుఁ బ్రి
ఖ్యాతిఁ జెడఁగొట్టెఁగద! లో, కాతీతమైన లజ్జ యలవడి యబలా. 22

క. అనుమాటకుఁ బ్రత్యుత్తర, మును జెప్పక యంతకన్న మొగ మించుక వం
చి నగుచు నా జలజాక్షి య, భినయమ్ముఁ బాండిత్యమెల్ల వెల్లడి చేసెన్. 23

తే. గీ. తెచ్చి పెట్టిన సిగ్గయ్యు దీర యగుట, సహజవైఖరిఁ గనఁజేసి చలదపాంగ
వీక్షణమ్ముల నొక్కింత వెల్లిగొలుప, నిందుముఖ లెక్క యయ్యుదారుఁడుపలుకు. 24

తే గీ. ఏటికిద్దాఁచి నీవలయించె? దింక, నీవు చెప్పిన దంతయు నిక్కమయ్యె
“వఱలులంజెలలోఁ బతివ్రత కులాంగ, నాజనమ్ముల లంజె యనుఁ” నాఁగవినమె. 25

తే. గీ. నీవు చెప్పినయట్లన యీవెలంది, యేదియో కారణమ్మున నిక్కలమునఁ
బాడమెఁగాఁబోలుఁ వయసునఁ బ్రౌఢయయ్యు, నింతబిడయమిక్కలమున నెందుఁగలదె.

తే. గీ అభినయమ్మది చూచినయట్టులయ్యె, గాన మీరీతి చక్కని కాంతి గలుగు
పలుకరుస గలకలుకుల కొలయ టుసదె! కవన మీకొంటికన్నను గష్ట మగునె? 27

క. అను నాతనిపలుకులు విని, తనపై నవ్వానిమనము తగులుట నిక్కం
బని యెంచి యంతలోఁ దీఱని చింత వహించి యిటు కరమునూహించున్. 28

ఉ. చక్కనివాఁడు మేటి సరస మ్మగువర్తన మొప్పువాఁడు బల్
టక్కరి గానముఖ్యకలలన్ గడు నేర్పరి ద్రవ్యవంతుఁ డ
మ్మక్క! యితండు నాకుఁ బ్రియుఁడౌట పురాకృతపుణ్య, మైనన్
జిక్కిన పూర్వపుఁబ్రియుని స్నేహము నేగతి మాన నేర్చెదన్. 29

క. ఇతనిన్ గాంచిన దాదిగ, పతి నీరై యంతు లేనిమరులున కోరై
సత మైనచింతఁబడి వి, స్మృతసకలం బయ్యె ముందు మెఁగుట యెట్లో. 30

చ. ఇతని వరించి యెల్లపు డహీనసుఖమ్ముల నందుచున్ రమో
న్నతి కధికార మూనినయునమ్మునఁ దన్ దలపెట్టనేని నన్
మతిఁదలపోసియున్ వినిపి మాటికి దూఱిమఁ ద్రోవగాన క
చ్చతురుఁడు కామునన్ విడి యశే మ్మెటువంటిది నాకుఁ గూర్చునో. 31

మ. ఎప్పుడో యే మగునో యటంచు మదిలో నెంచంగ నేలా! యితం
డిప్పుడే తా మొగ మింత చేసికొని యేదేఁ బెద్దయాపత్తు నె
త్తిపయిన్ వ్రాలినయట్లు చింతగొనుచున్ దీనత్వముం బూనుటన్
గపటానందము పైకిఁ జొప్పడఁగఁ దన్ గన్పట్టుచున్నాఁడహో. 32

సీ. ఏకర్మమెఱుఁగని యేలబ్రాయమున నేను కసరికొట్ట నొకింతవినువఁడయ్యె
నెఱిఁగియు నెఱుఁగని చిఱుతగుబ్బలఁ జేట్రి పరుసదనానకు వెఱువఁడయ్యె
నెట్టకేలకు నాదుగుట్టు కైకొని వృద్ధ యాడిపోసినదాని కలుగఁడయ్యె
నాకారణమునఁ దనకుటుంబమునఁ గల్గుకలహమ్ములకు భీతి గాంచఁడయ్యె

గీ. నన్నిటికినోర్చి నను బ్రియురాలిఁ జేసి. దైవమో యనుబుద్ధి నెపుడలంచు
చున్నవాని వృథా ద్రోహ్యయున్న కార, ణమున విడనాడు నాకు జన్మమునుగలదె

గీ. దాత్యమంగీకరించె నాతనిఁ గరంచె, నంతఁ బోకిమ్యేషకుఁడెచ్చెఁ జింతగలిగి
యునఁ మదుపకారమునకు దానినెడఁజేసి, యీనుదిగమిరింగ నింతవిశ్వాసిగలఁడె!

చ. ఇటుపయి నీతనిన్ మఱవకే యొకభంగిని గారవించి య
క్కుటికము చూపి నేను గలకాలము సౌఖ్యము నందఁజేసినన్
గటకట! తానెవన్ మఱమఁగాక యిదెల్లను గామియౌట, నా
కెటు మఱలంగవచ్చు నిది యెన్ని భవమ్ములకైనఁ జాలడే. 35

చ. "తనప్రియుఁ డైవవాఁడఁ టొకతప్పును నాతనియందు లేదఁ చే
పనియు నొనర్చువాఁడఁటు! సెబాసు! ధనమ్మున కాస చెంది య
య్యనఘుని నీచకృత్యమున కాప్పుడుఁ గా నొనరించె నొక్క రో
వనిత" యటన్న దుర్యశము వాయుఁగ నాకు నుపాయ మున్నదే. 36

తే. గీ "పెండిలివి నాడకుండిన నుండెఁ గాని, వారకామినియైనను వయి నొకానొ
కని వరించి తదనుగతి గా మెలంగవలయు" ననుకట్టుఁబాటుండవలదె! జగతిఁ

ఉ. మాలెతకన్న హీన లగుమానవతుల్ వ్యభిచారవృత్తికిన్
జాలక కట్టుఁబాటునకు జంకుచు నొక్కొకనిన్ వరించుచున్
గాలముపుచ్చుచుండ, గణికాజనమంతకు నెంతహీనమో
కూళతనమ్మునన్ బహుచుకొంటకు రోయ వోకించుకేనియున్. 38

తే గీ. ఒకఁడు వోయినమీఁద వేఱొకనిఁ గట్టి, కొంటమాచార మొకకొన్ని కాలములం
దు నందులోనను జేర దీయధముపలము, ధాత వంచించె నీజాతి తలియఁబోండ్లఁ.

క అనితపమనమునఁ జింతిలు, వనితామణి సారెసారె, వార లిరువురున్
దనతన కనుగుణ మగు రీతి జింతం గాంతు రదియుఁ దెలుపజాలకమే! 40

గీ. మగుడ నీగతినొండొరు మొగములగనుచు, నెడతెగనిచింతయనుసంద్రమీఁదుచుండఁ
దరణి యంతటివారికిఁ దగణియగుట, హా! యనఁగఁ బశ్చిమాంబుధి డాయఁజనియె.

క. అంత నుదారుం డచ్చెలి, చెంత న్నిలుపోపలేక చేతోజాత
క్రాంతికి వశుఁడై చనియెడి, చింతఁ జేమటయు నతని చెలికాఁ డనియెన్. 42

ఉ. గానమువింటిమో కవనకౌశలముం దిలకించినారమో
మానమునందుఁ గల్గు నసమానప్రజ్ఞాచాతురి దక్కఁ బంకజా
తానన యిందుకే నభినయంపుఁ బ్రసక్తియుఁ జూపదయ్యె మీ
రీ నలినాక్షిపై నలిగి యిక్కఁగణింపఁ జనుచెట్టు లొప్పగున్. 43

ఉ. నావుడు నాతఁ డిట్టులను "నాదుమనమ్మునఁ గోప మంచు నీ
వేరఁ నిశ్చయించి? తని యొక్కఁడిచాతురి? యింతమాత్రనే
యావగలాఁడి నమ్మెనె? సఖా! యొకవిద్దియుఁ గాదు దీని కే
తోరవల నేలతాంగి నవతుం గనఁజాలు! నెటాసు! వహ్వారే! 44

క. కనుఁగొనినమాత్రనే మన, మున మోహం బుప్పతిల్లె ముమ్మాటికి ని
క్కఁ గాంగి కింకరత్రమిమి, చ్చిన దానంజేసి మనకుఁ జేటగుఁజుమ్మీ. 45

చ. ఇదిమొదలిత్తలోదరికి నెవ్వరియొద్దను పద్దె చూపునీ
చదలఁ దొలంగఁజేయ నుపచాపుఁడు యత్నమొనర్చఁగాక యి
వ్వ్మసవతి సిగ్గునం దిటులు ప్రగ్గుమనుంటులు చూచి యాత్మసం
పద నెడింపఁ జేయుచెలిపట్టున నాతఁ డనుగ్రహింపఁడే. 46

తే. గీ. మరలరావచ్చుఁగవచ్చుఁద్వరయదేల?, యబలయేమగు? మనమేడకరుగువార?
మభినయంబెందుఁజొచ్చు? నెందడఁగుగాన?, మకట! యారంభశూరత జగతి నెందు.

క. నావుడు నర్మసఖుం డ, ప్పావుంబోఁడిఁగని పల్కెఁ "బోలఁతిరో? నీవైఁ
గావలసినంతకోరిక, చే వచ్చినవారి నీట్లు నేయం దగునే? 48

క. సుమగాత్రి! వారి మంచితనమున నీ్నలోటు దాఁగనం బడదయ్యెన్
దమలపుటాకులకున్ నో, చమె? యెఱుఁగవె? యిదియు సాంచంద మ్మగునే?

మ. అన నచ్చేడియు భూమణధ్వనుల పాల్పవ్వారిగా నల్లఁ గ్ర
మ్మనఁ గేళీభవనమ్ము చెంతఁ జని యాపల్యపోఁకలున్ దక్కఁ గ

ల్గిన మేల్వస్తువులుగూర్చి పళ్లెరమునకా గీలుకొల్పి యొయ్యారపుమొ
ల్లము రూపై చనుదెంచెనో! యనఁగ మెల్లన వచ్చి యచ్చేరువన్. 50

గీ. వినయభయసంభ్రమమ్ములు వెల్లిగొనఁగ, నిలువఁబడునంత నద్దానినీటొకింత
యడ్డులేమిని గనులార నతఁడు గాంచి, నిలువునీరయి యట్లన నిలుకఁబడియె. 51

తే. గీ. అంతనచ్చెలి మిన్నకరాగ్రకీలి, తమ్ములకు నాగవల్లీదళమ్ము లతని
హస్తమునసంది పళ్లెర మచట డించి, చని యథాస్థానమున నిల్చెఁ జవులుగులుక.

ఉ. అంత నుదారుఁ డొక్కగతి నచ్చోటు వీడి తదేకచిత్తుఁడై
యింతివిలాసముల్ మగువయొప్పులు నైదలి మేల్ హారంగులుక
గాంతయొయ్యారముల్ కనులఁగట్టినయ ట్లైనను నృటింప న
క్కాంతుఁడు లేనిమేళ మటఁ గల్పనసేయఁగఁ జూచుచున్ జనెన్. 53

ఆ. వె చనుచు నర్మసఖునిగని యిట్లుపల్కు "నో, చెలిమికాఁడ! జగతిఁ గలుగుపట్టు
ణముల మాపురమ్మునంగల చోద్యముల్, గానరావు వేరొకంట నెందు. 54

చ. అటఁ గులకామినుల్ పడపుటంగనలున్ మతివేనవేలు మి
క్కుటమగురూపమున్ హావములు కొల్లలుగాఁ గలవారలుండురి నా
కెట నిటువంటిచానఁ గను టెన్నఁడునున్ లభియింపదయ్యె ని
చ్చట భవదీయసంగతివశమ్మున నింతటి భాగ్య మబ్బెఁగా! 55

క. నాతోడ నీవు సెప్పిన, యాతరుణీమణియె యిదిసఖా? యది గాదో?
యీతీరెక్కడ? నీవను, నాతీరెక్కడ? శతాంశ మంతరమునుమీ. 56

ఉ. చూడకమాచు నేర్పు వినుచున్ వినకుండెడికాళలమ్ము మా
టాడక యాడుజాణతన మన్నిటికేమి? యొకింత లోనఁ బో
రాడుట కమ్మనోభవు విటాళిపయిన్ బురికొల్పుపాల్పు పూఁ
బోఁడికి దేనికిన్ గలుగఁబోలను దీనికిఁ గల్గుచాడ్పునన్. 57

తే. గీ. గుబ్బలబెడంగు పిఱుఁదులగొప్పతనము, మేనితళతళలును మోముమిసమిసలును
గలికిరైయెంతమాత్రిన గల్గు నిక్క, తమున మెచ్చితి నంచెద్దఁ దలఁతు వేయు.

మ. పలుకులు వేయు నేల? పరభామ లనన్ గను లెత్తిచూడ నే
నలవేలఁదుల్ సుఖమ్ముగను వీనులుచల్లఁగ నెంతపాడినన్,

కలఁగదు మానసం; బిపటు గానమటుండ మటొండటుండఁ బ
ల్కులును వినంగలే దకటా! కోరికలీరిక లెత్తనేటికిన్!

చ. తరము లనెన్నియో జరిగెఁ దాతల తాతలు వారితాతలున్
మఱియును వారితాతలును మాకొలమం దిటువంటి కోర్కెలన్
మరగరు, దానికేమి, కడు మన్ననకెక్కిన పాంసుతీఘనం
భరు లటువంటివారి కిఁక బాకతనన్ ద్రిదివస్థితుల్ చెడెన్. 60

తే. గీ. ఏమయినఁ దప్పదింక నీయింతి చెలిమి, యయ్యదియు నీయధీనమై యలరుకతన
నచిరకాలలభ్యంబని యాత్మనెంతు, వనుదు నతఁడిట్టులను నుదారునికిఁ బేర్మి. 61

ఉ. చెప్పితఁగాదె! మురన్ రసికశేఖర! యాలలితాంగి చంద, మ
య్యొప్పును గొంత మీ కనుభవోచిత మయ్యెఁగదా! తదంత న
య్యొప్పులకుప్ప యొప్పికొను టొక్కటిదక్క నుపాయమింపునన్
జొప్పడ దన్య, మేమయిన సుందరిడెందము చూచిచెప్పెదన్. 62

చ. ధనమున లెక్కలే దొకటు దానికి లోఁగిన వేలసంఖ్య కె
చ్చును, నదియేనిఁ దజ్జనని మాపువకున్ భరియగొల్పునేమొ? య
ట్వనజముఖీలలామమును వంచనసేయఁగ నేయుపాయమున్
బనుపడ దైవ యత్నమును మానఁగరా దెపుడెట్టు లుండునో! 63

చ. నినుఁ గనుఁగొన్న మాత్రమున నే వెలచేడెల లెక్కయేల? యే
వనజముఖీలలామములు వాంఛ యొనర్పక మానవేరు! రై
వను నిటు యత్నమేల యనఁ? నాయనుభూతినిఁబట్టి చూడ ని
క్కనకనిభాంగి యోగిఁగఁ గాంచుపుచ్చెదునంచుఁ దోఁచెడిన్. 64

ఉ. కాని సమంజస మ్మనుచుఁ గన్పడ దిప్పటి యూహయున్ సదా
గానమునందురక్తి వెలఁగల్గు నలంకృతులందు సక్తియున్
మానశరపరిచారములఁ జొప్పడుకబ్బములన్ బరిసక్తి య
చ్చానకు నొందు, తద్విధము చంచలతం గనఁజేయు నియ్యెడన్. 65

సీ. మునిఁగిపోయినదేమి? యమ్ముకుదతల్లి, తోడ మామది నున్న సంతోస మెల్లఁగఁ
జేసి యామీఁద వానికిఁ జెప్పఁజేసి, యేనును జెప్పుచూతు నిందేటి దింత! 66

ఉ. నావుడు నత్యుత్కత్వ మెదవాటు నుదారుఁడు పల్కె "నెప్పుడో
నీ విటు నేతు" నన్న నెటు నే నిలుపోపుదు? నేఁటిరేయి నా
కావగలాఁడి, యాయతివ, యాచెలి, యాచిగురాకుఁబోఁడి, యా
కావరపుం జనుంగవ బోఁటపుటిక్క, వశమ్ము గావలెన్. 67

క. రేపేమో మనమేమో, యాపూవుంబోణియేమొ యన్యమదేమో
నే పా మ్మిప్పుడ నాసం,తాప మ్మోడఁ బాపు మింకఁ దడయకు మిచటన్. 68

తే. గీ. చందురుం డగ్ధుదయించెఁ జదల వెన్నె
లయును బర్వఁగఁ జొచ్చెఁ దొలంగెఁ దమము
మందమారుత మదె చూడు కుందకుల ప
రీమళమ్మును వెదజల్లెఁ రేఁగె మరుఁడు. 69

ఉ. తల్లికి నేమిచెప్పెదవొ? దానికి నేమని విన్నవించెదో?
పల్లవపాణి కేకిరిటుఁ గృపన్ గలిగించెదో? నన్నుఁ దమ్మనో
వల్లభుఁ జేయు భారమది పైబడికొమ్మటు నీ వొనర్చినన్
జెల్లు నటంచు చెఱుంగు మొకచేడియ వానిఁగ నన్ దలంపుమా. 70

చ. కలదు ధన మ్మనంతముగఁ గంటికి మింటికి నంటుమాడుగుల్
గలవు సమస్తముం గలదుగాని యొకించుక లేనివారిలో
పల నొకరుండ నియ్యబలఁ బాణిగృహీతఁగఁ జేయునేనిఁ, గ్రొ
ర్క్యాల కెనగాని సంపదలు కుంకుమలేని కులాంగనామణుల్. 71

ఉ. ఏ నని తా నటంచు నొకయించుక భేదము లేకయుంట న
చ్చానకుఁ జెప్పఁగాఁ దగినసంగతు లేమని బోధసేతు నీ
కే నెఱిఁగింపఁగావలయునే? యదిగాక, ప్రాకృతంపుఁబు
ణ్యాఁగదా! లభించితివి నాకొకదూతగ నీవు నెచ్చెలీ. 72

చ. అన "నిదె పోయి వత్తు" నని యాతఁడు వెన్కకు నేఁగ, మీఁద మె
ల్లన బసకేగి మిక్కిలి యలందురునెమ్మదితోడ భోజనం
బొనరిచి మిత్రురాఁకకయి యొక్కఁడ నొక్కఁడు గూరుచుండి తాఁ
గనఁగొనుచున్ ద్రుటిన్ యుగముగా గణియించుచు మారు దూఱుచున్. 73

ఉ. చెప్పఁగ రానివేదనలచే నలచేడియ నాత్మ నెంచి "నీ
గొప్పపిఱుందులున్ వలపుగొల్పెడి మేల్పలుచాలు లక్ష్యమున్

దప్పని చూపుకోపులను దామరతంపర లైనలీలలన్
ముప్పిరిగొన్న మోహమున ముంచెఁగదే! జగదేకసుందరీ. 74

ఉ. చందురుబాధకే సయిపఁజాలుదునో, మదనాగ్ని కాఁకకే
కందకయుందునో, ప్రియకాలునిజో దలచల్లగాలికే
వందురకుందునో సకలవాంఛలకున్ గుదురైనమన్మథ
చ్ఛందనవల్లి! నీదయిన సంస్మరణాశయె మానుకొందునో! 75

మ. అకటా! నే నెటు తాళువాఁడ, నట నీవాకంబవుం బాటునన్
వికచాబ్జమ్ము లిరంగెలంకులను నావిర్భావమున్ జెంద మి
న్నక వీక్షించుచు లజ్జకొజ్జ యయి యానతింపఁగాఁ జేయు నా
ప్రకృతిన్ లోనఁ దలంచినంత మది నీరంబౌఁ గురంగేక్షణా. 76

క. అని తన్మయమగు మనమున, ఘనతర మగు రాగమెదిగి కాలూన నతం
డనిమేషత్వముఁ గైకొని, యును సురతావాప్తి కొఱకు నూహించు నహో. 77

తే. గీ. అట్టు లొకకొంత సేపు మి న్నరసి యచట
గలికి గోరులసొంపు నచ్చెలియమోము
పెంపు నొకకొంత గని యంతఁ బెదవిఁ గఱచి
నర్మసఖు నాత్మ నెంచి తన్నాయకుండు. 78

మ. "ఇదిగో! వచ్చెద" నంచు నేగి చనఁడేఁ డేణాక్షి యేరీతి మ
న్మదమున్ గాంచెనొ? యెట్టియుత్తరము నన్నుంగూర్చి తానంపెనో!
యదనున్ వమ్మొక్కరింప నెంచదుకదా! హా! దైవమా! యిట్టి క
ష్టదశాపాకము మిత్రుఁ డొప్పికొనునే! చాతుర్యమున్ జూపఁడే! 79

ఉ. ఎక్కడిమిత్రుఁ! డే నచటి కీతని నంపుట గొప్పతప్పు "తా
నక్కవకాంగి కీతఁడు ప్రియంపదుఁడాఁ" డని వింటిగాదె? ఛీ!
మక్కువ యెంతచేసె! ననుమాన మొకించుకయేనిఁ గాంచ కా
డిక్కున గట్టివాని వెదకీయక పంపితి నెంత వెఱ్ఱినో! 80

తే. గీ. "తెలివితేటలుగలవాఁడు ధీరుఁడితఁడు, చనినచోఁ గార్యసిద్ధి యౌ" నని తలంపఁ
గూలిపోలి సామెతయొనగూడె దాని, నేగి నథమునానూకఁ జేయుచుండె నేమొ!

ఉ. "కుంటెన కాఁడొకింత కొనగోటను నైనను మీటకుండ నా
గ్గంటిని నాయకున్ గలుపఁగా గమకింపఁ"డటంచు మున్ను నే
వింటిని వేయిసార్లు, విధి, వీఁ డిఁక నచ్చెలిమిన్న తోడ నా
యంటును సొంటునుం దెలుప నాడుచుఁ బాడుచుఁ గూడుచుండెఁ బో! 82

గీ. తనదుచిత్తమ్ము నేనియుఁ దగినపొగను, గలుగుచెలిమిన్న కడకంపఁ గదలి రాదు
అట్టిచోఁ గేవలాన్యుల నంపనగునె? దౌత్యమునకన్న సతిపొందు తప్పిదంబె? 83

క. పురుషుఁడు పురుషునిసంప్రతి, తరుణి తరుణిసంప్రతియును దగ దొండొరు లొం
డొరుల ననుపఁదగు దౌత్యము, విరచించెడిపట్లఁ గడువివేకము మెఱయన్ 84

మ. అని మిత్త్రుం గడు దూఱుచున్ మనమునం జాలోచనల్ సేయుచున్
వనితన్ లోఁదలపోసి యుల్కిపడుచున్ వైరాగ్యముం గాంచుచున్
దనకై తానటు కేగ నూహగొనుచున్ దర్కించుచున్ దాపమున్
గనుచున్ గుందుచు నుండె నంత హితుఁడున్ గన్పట్టె దౌదవ్వులన్. 85

క. కని "యతఁడగునో కాఁడో", యనియును "కార్యమ్ము సఫలమయ్యెనొ లేదో"
యనియును "నిష్కారణ మిత్త్రు ననఘాత్ముని దూఱితి నాఁడ" ననియును వగచున్. 86

తే గీ అంత డగ్గఱి కేతెంచి "యనఘ! నీవు, పనుపునన్ జని యాశపత్త్రనేత్త్రఁ
గాంచి మెలమెల్ల నీప్రసంగము వడించి, తెలిసికొంటిని మదినున్న తెఱఁగు కొంత. 87

క. అంగీకృతి నూచింపద, నంగీకృతి తెలుప దెందు నతివలు లేరే?
రంగైన మిమ్మువంటి భు, జంగుఁబిలువ పంది యిట్టివందము కలదే? 88

చ అయినను నాలతాంగిహృదయం బొకకొంత భవత్సమాగమ
ప్రియమని కొన్ని చెయ్వుల నెఱింగితి నంతఁ దనంత నెమ్మిఁ ద
ద్దయుఁ గతినాత్మ యత్యతివతల్లియు నయ్యెడ కేగుదెంచె నా
కయు మొకకొంత దెల్ప నది సమ్మతి గన్పడఁ జేసి యిట్లనెన్. 89

ఉ. ఏయెడనైన "నియ్యతివ యెవ్వరిసాని?" యటన్న చో "ఫలా
నా" యని చెప్పికోఁదగిన నాయకుఁ డబ్బిన మాకుఁ గీర్తియౌ
"నీయనసాని యెవ్వతయొ యెట్టిదియో?" యని నప్పుడో "ఫలా
నా" యని చెప్పికోఁదగిన నాయిక గల్గిన మీకుఁ గీర్తియౌ. 90

తే. గీ. ఎట్టులేనియు మర్యాదయే ప్రధాన, మనుచు వర్తితునే కాని ధనమదెంత
వచ్చినను వేఱురీతుల కిచ్చసేయ, నెఱుఁగరే? మీరు నామనోవృత్తిరీతి. 91

చ. ధనికుఁడు రూపశాలి గుణధన్యుఁడునున్ వదాన్యుఁడున్
జనవయసొప్పువాఁడు నెటుచేసెను? దాతృకుఁ డిట్టికేలకున్
దనకు లభించె మీకృపకతమ్మున, నియ్యెడఁ దక్కఁజెల్లునే!
యనవగువాని మానఁదగునా? మనకెల్లపు డిట్టిఁ డబ్బునే? 92

ఉ. కావున మీరు చెప్పు రసికప్రియునిన్ గని శంకఁ దక్కి నే
నీవిధిఁ జెప్పినట్లు వచియింపుఁడు "నాదు తనూజపైఁ గడున్
భావము మీకుఁ గల్గు టది భాగ్యముకాని సదా కళత్రసం
భావన దీనిఁ జూడఁదగుఁ బ్రాయము శాశ్వత మానె? యోషికిన్. 93

క. వినువవలసివచ్చిన లో, గడ నిచ్చిన దట్టులుండఁగా దానికి ము
మ్మడుగధికమిచ్చుటకు ని, ష్ఠాపపత్రము వ్రాసికొనుఁడు పూవుంబోఁడిన్. 94

క. "మోమోటమించుకయు లే, కీఘనలిరి యిట్టులనియెనే?" యనకుఁ డహో!
కాముకు లెక్కఁడ? సత్యము, లేమాడ్కిఁ?" నాకుఁ గ్రొత్తలే! యివియెల్లన్. 95

తే. గీ. మొదల నేన్పాటకం డిట్టులాడ వేని, మేమె మీరయి మీరలే మేమునగుచు
నుండఁగావచ్చుఁ గూడనే? తొడిపట్లు, మతియుర్వ్యవహారపుంట్లు మాటకుఱు న 96

గీ. అడఁచటింబోలెఁ బలువుర నాశ్రయించి, యొకరికనుఁబ్రామి యొకరితో వికవికలకుఁ
బోవుటలు నాగృహమ్మునఁ బూవుఁబోఁడ్లు, సేరరిదిమీకుఁ బదపడి నిక్కమగును 97

చ. వలపుగలన్ని నాళ్లు మగువా! చెలియా! సకియా! తలోదరీ!
చిలుకలకొల్కి! యంచుఁ గడఁజేరికచేసి సమస్తవస్తువుల్
పలుమఱు తెచ్చియిచ్చి యటుపై నది కొంచొక తగ్గనేని య
క్కలికి మొగమ్ముమాడ రిది కాముకధర్మము నేనెఱుంగుదున్. 98

చ. కలసినకొన్నినాళ్లు కటిగాఁ గనపట్టెడిమేను లై దినం
బులు చనుమీఁద రెండునయి పోవఁగఁ బోవ మగండు నాలు నై
వలపు క్రియమ్ముగా నుడుగుపట్టుఁ సానియవస్థ చూడఁగా
వలయు మఱొక్కఁ డట్టియెడ వచ్చునొ? యిచ్చునొ? కామితార్థముల్. 99

చ. వదలినఁ జచ్చిపోము మన వైఖరి యిప్పరమంచు నెందుఁ దా
మొదలఁ గనంబడున్ బిడప మోహముతగ్గియు జ్ఞానముబ్బినో
మదనతికన్నఁ బూరుషు మానస మెండొక చుల్కఁబాఱు న
య్యది గనిరెట్టులేని వెయాంధ్రము నేగతి నుప్పునెగ్గడిన్?

చ. తగినపీటుండు చేకుఱఁడు తారసమైన ధనమ్ము లేఁడు సో
యగమును నీగియుంగఁగలుగు గట్టిఁడయేని యతండు నిర్ధనుం
డగు మన మిచ్చువారు కఱవా? ధనమిచ్చెడి వారె కాని, యే
మగువకు నేని సౌఖ్య మనుమానము మాగణి కాకులమ్మినన్. 191

గీ. "సానులను జేయుటుడిగి లోకానుగతిని, పెండిలియొనర్చుకొనరాదె? వెలవెలంది"
లంచుఁ గొందఱుబోధింతు రదియునంత, మంచిత్రోవటంచు నాపదికి రాదు. 192

శా. త్రాగుఁబోతులు జూదగాండ్రు వనితాగ్రప్రాపకుల్ సోమరుల్
భోగంపుంగొలముందుఁ బుట్టుపురుషుల్, పూఁబోండ్లు విద్యావతుల్
యోగోద్రేకిను లుత్కళార్హ లెటు లీయోషామణుల్ నీమలన్
భోగింపం దగువార లిట్టులయినన్ బోకున్నె? మర్యాదయున్. 193

ఉ. సానిగఁ జేసె నేనియును శాస్త్రులుఁ బంతులు మంత్రులున్ ధరే
శానులు వైశ్యరత్నములు సంపద గల్గెడి యెల్లవారు సం
స్థానము గాచు సేవకులచందమునం దనయిల్లు గాతు రిం
కేఁలివాక్షికిం గలవె? యిట్టిమహోన్నత భోగభాగ్యముల్. 104

సీ. "ఏకలెక్టరుకు లేదింత వ" ర్కనుభంగి నుత్తరమ్ములును బ్రత్యుత్తరములు
"ఏడాక్టరుకును లేదింత యల్జడి" యన్న చందాన నిలుగాచు సారటులును
"ఏజమానాకు లే దీచంద" మనుభంగి నూఁకిగం బొనరించుచేడియలును
"ఏదేవతకును లే వీకానుక" లనుశేవ ఫలపుష్పముఖవస్తుపటలములును

తే. గీ. తనకొలమ్మునఁబొడమినమనుజు నొకనిఁ గట్టికొని కాఁపురము సేయుచలికి కట్లు
గలుగ నేర్చునె? సానియై వలచి వలపు,గలుగఁజేసెడి కలికిమిన్నలకు దక్క.

తే. గీ. జగతి "వాణిజ్యకృషికర్మ జనవరేణ్య, సేవనమ్ముల సంపదల్ చేకుఱు" నని
చెప్పుదురు గాని తగినట్టియొప్పుగలుగు, సానిగడనకు నవి శతాంశములు గావు.

తే. గీ. నీచ మిదియంచుఁ గొందఱు నీతివిదులు, పల్కుదురు సత్యమే యట్లుపల్కువారు
నలుప్రవృత్తుల నిట్టినైచ్యం బొకింత, లేదె? యొక రొండొకరి నెంచ లేకపోరు.

శా. ఉద్యోగం బని ప్లీడరీ యనియు నెంతో మంది శ్లాఘింతు రా
యుద్యోగంబు శ్వవృత్తి రెండవది తా నొక్కొక్కడన్ మాపనిన్
"హ్వాద్యంబా" సనిపించు లాభమది యొందేఁ గల్గు నావృత్తి సం
పాద్యం, బయ్యది పూజ్య మెల్లగను, నీచానీచతల్ చూచిరే? 108

క. ఏకార్యకరము లోకము, లే కడవాటున స్వవృత్తి నే తద్వ్యక్తిన్
దాఁకు నసత్యమ్మిది వే, శ్యాకాముకు లైనరసికు లారయుదు మదిన్. 109

క. ఏవృత్తిఁ దలఁచి చూచిన, నావృత్తిఁ దగినకష్ట మందుండెను వే
శ్యావృత్తికి సెజ్జపయిన్, గావలసినయంతపసిఁడి గలిగెడిఁగాదే? 110

తే. గీ. అయిన నే మిట్టిమేలైనయట్టి వృత్తి, కిప్పు డెన్నెన్నియో సంఘటించె ముప్పు
లక్కటా తమ్ముఁ దగినంత యట్టికట్టు, దిట్టదలు చేసినన్ గాని దీఱదింక. 111

గీ. అనుచు నేమేమియో చెప్పిన మదాయఁ, దాననము వికసింప "నో యనఘ! వృద్ధ
గోరు టది తప్పుగా దిది క్రొత్త యగునె? యెవరుగోరరు? కూఁతుల నిచ్చపట్ల.

క. వారలు గోరిన నది యొక, తీరుగఁ గనుపట్టుఁ దగమతిన్ దలపోయన్
ధీరులకు నదియు నితరము, నారూఢిగ నొక్క విధమయగుఁ దుద కెన్నన్.

ఉ. ఇంతకు నేఁటిరేయి నను నేణవిలోచనతోడఁ గూర్పఁగా
యింతి యనుగ్రహించెనొ? మహాత్యాదియే నిదిగాక యడ్డు నొ
క్కింత వచించెనో? నొడువు మిచ్చట కన్నఁడు వెన్కఁదీయ నే
యింతికి నేనిఁ దప్ప దిది యేటికి నాకడఁ జెప్పఁగావలెన్. 114

క. అనవుడు నతఁడిట్లను నే, నను నిట్లన చెప్పి తన్మనోగతిఁ గలవ
ర్తం నెఱిఁగితి నంగీకృతి, కనుపట్టెనె జను లెటు తడవుగా? మన మింకన్. 115

ఆ. వె. అనుచు నయ్యుదారు నచ్చెలిమిన్న కే, శిగృహమ్మునకుఁ జెలిమిదలిగ్ప
వెంటఁ బెట్టుకొనుచు వే దీసికొనిచనె, నర్మసఖుఁడు కామధర్మవేది. 116

గద్య.

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం

బైన పాణిగృహీతయందుఁ

ద్వితీయాశ్వాసము.



# పాణిగృహీత.

## చతుర్థాశ్వాసము



ర్భకశ్రీగుంఫిత
జోగాంబారామయార్య సుచిరకృత తపో
యోగపరిణామ లలిత
శ్రీగంధర్వాభిరామ సీతారామా.

తే. గీ. అవధరింపు మనంతరం బత్తలోదరి యుణి నువారుఁ గల్పి యాశామునందు
చిన్నవోయినమోముతోఁ జెలియు మనము, నందుఁ దలఁచుచుఁ దనయింటికరిగి పిదప.

మ. అకటా! పిన్నటనాఁటనుండియును నాయానంద మానందమై
వికలత్వమ్మును దాదృశంబయి దయావిర్భూతిమై నెందు భి
న్నకృతుల్ నేరకయున్న నెచ్చెలికి నన్యాశ్యంబు నేఁ డబ్బి నన్
వెకలిన్ జేసెఁగదా! వృథా వెలచెలిన్ బ్రేమించి కామించితిన్. 3

ఉ. నావలనన్ గ్రహించె లలనామణి బాహ్యగతాదిసర్వసం
భావన లక్కటా! యది సెబా! సని యన్యుఁడు మెచ్చనయ్యె; గో
దావరి పుట్టు టొక్కయెడ దానిప్రయోజన మింక నొక్కచో
నీఁధి గోత్రయే? యెటేఁగి యిప్యెడ నేఁ దపియింప నొప్పునే? 4

శా. నాకన్నన్ గడఁ లేఁతప్రాయమును విద్యాజన్మమున్ దేజమున్
శ్రీకూలంకవభోగభాగ్యములు వాసిన్ బోల్చ నవ్వానితో
నేకీభావము నంది యియ్యబల నన్నే మంచుఁ గామించు? నే
నీ కాంతామణి కింక నీర్విడుచుటే యొబ్బంగి యుక్తమ్మగున్. 5

చ. అరమరలేక చిన్నతనమాదిగ నొక్కటియై పరస్పర
స్మరణముదక్క వేఱొకవిచారము దూరముఁజేసి విప్రలం
భరసము వెళ్లఁబుచ్చుచుఁ బ్రపంచమెఱుంగని యట్టియున్మనున్
విరహముపాలు సేయు నవివేకికి ధాతకు జన్మమున్నదే? 6

ఉ. సానులు లేరె! యీజగతి, జాణలు గారె? మనమ్ము నీరె? యే
సానికి నేబొఱుంగువరు సఖ్యము లీగతి గల్గెఁ? గల్గుఁ బో!
యీనియతిన్ మఱొక్కనికి నింతిని దానయి కూర్చి పొమ్మనో?
మానము దక్కె దేఁడు వెలమానిని నమ్మిః యెట్టొకాండ్రిడున్. 7

సీ. కలికి యింతకు వానికెలన నల్లననిల్చి యొయ్యారముగ వీడె మియ్యకున్నె?
అబల యింతకు వాని యక్కుఁ జక్కఁగఁ జేరి ముద్దుముద్దులు మించ మురియకున్నె?
వెలఁది యింతకు వానితలఁపులూరఁగఁ జెక్కుఁగొట్టి నెట్టన ముద్దు వెట్టకున్నె?
కలిత యింతకు వాని మరుకేళిఁ గరఁగించి కరువంపుబిగువంబు గాంచకున్నె?

తే. గీ. అలలన లేనిపోనిదైనట్టిపలుక, గాంచి యింతకు నాయెమ్మెకానిచేత
ననునయమ్ములవెన్నియో గొనకయున్నె?, చెనటిదైవమ్ము నన్ను వంచించె నకట 8

మ. పలికెంబో! చెలి నన్నుఁ గూర్చి "యొయనిన్ బ్రాణేశుఁ గావింపు" మం
చలుకన్ లోఁగొనియున్ వెలిం దెలియనీ కంగీకృతిన్ జూపి ని
క్కలుమంబో మదినూని వాని సతివన్ గల్వంగ నా కొప్పునే?
తెలియుంజాలక మోసపోతి నిటు నీతిన్ బూనఁగాఁ జెల్లునే? 9

చ. వెలచెలిఁగూడు టొక్కయవివేకము కూడినవా రసత్యముం
బలుకమి గొప్పతప్పిదము, పాయునెడన్ బుజువర్తనమ్ములా?
కలుపుట, దేవుఁబట్టి సదృశంబగు పత్నిఁ గూర్చు టొప్పు నా!
వలపున ముంచి మించి యిటు వాతులు గోతు లొనర్తు రక్కటా! 10

తే. గీ. అనియెఁబో! లంజెయాటఁ దాఁటిమాట, నాదుసౌభాగ్యతయొయ్యెశబూదిఁగలిపె
వేయునేటికి? వెలయాఁడ్రు డాయువారి, కంతకష్టము దుర్వృత్తు లబ్బు నిజము. 11

ఉ. దానునిరీతి దానిపదతామరసమ్ముల నాశ్రయించుటం
జేసికదా? మదీశ్వరుఁడు జేయనిదుష్కృతి నెవ్వకల్మి న
న్నాసతి చేరఁజేసె నకటా! యిటు లెవ్వఁడు చెప్పె నప్పుడే
కోసిన నేమిపాప మగుఁ? గోమలి నాలుక యింతయింతగన్. 12

తే. గీ. నన్నుఁ జిననాఁటనుండియు నమ్మఁజేసి తుదకు నీగతి దుర్గతిఁద్రోసి యొరునిఁ
గలసి కులుకుచునున్న యక్కలికిమిన్న, కేల తగుఁదు? నాయుసు రిహమునందె. 13

ఉ. ఇంతయుపాత్రురా లగుట యెల్లనెఱింగి యదేమి పాపమో
యింతిపయిన్ మనంబు పరువెత్తెడి నుత్తలపాటు జెందెడిన్
గాఁత దలంచి, యౌర! "విటకాండ్రకు నెక్కడిమాన?" మంచు సి
ద్ధాంతముగా వచించు కవితల్లజు లూరక వాఁగువారలే? 14

ఆ. వె. నిక్కమింతకైన నీత్రికాండ్రకు మనం, బీయ కిచ్చినట్టులే నటించు
నకట! వారకాంత లద్దమ్ములో మోమ, దెట్టులుండు? నదియు నట్టులుండు.

తే. గీ. మెచ్చి బంగారమునకాదిమూర్తియైన, వెలవెలందుల పేరెము లోనలనుకొన్న
యట్టివిటులకు బ్రత్యక్షమున బటుండ, బలుపురుగు నవ్వ ద్రిష్యాది పైకొనదు 16

తే. గీ. తరువునందలి సారమంతయును సయితము, నల్లనల్లన లాగి వారాంగనాజ
నంబు తమవిటులను గుబుసంబు భుజగుఁ, లువిడుచుఁ ద్రోతు రిదిగనుఁగొనరు విటులు. 17

చ. కొలమునఁ బుట్టి ట్టియొకకోమలిఁ బిల్లటఁ దాఁడ పెండ్లియై
కలిగినయంతలో సుఖముగాఁ దలిదండ్రులు నత్తమామలున్
బలుమఱు దన్ను మెచ్చఁ గులపావనుఁ డన్నయశమ్ము లోకమం
దలరఁ జరించువారివిక దా ? నిజమైన సుఖమ్ము లెమ్మిఁకన్. 18

క. అని యాతఁడు పలువిధముల, మనమునఁ దలపోయుచుండె మానినియును సదా
రునిఁ గలసి మెలసి యుండును నో, య్యన నాలో నితనిఁ దలఁచి యాత్మగతమునన్. 19

మ. అకటా! నన్నెడఁబాసి యెన్నఁడెఱుఁగం డవ్యాజరాగాశ్రియుం
డొకరిం బోలెడివాఁడు గాఁ డతఁడు నన్నుల్లమ్మునం దెంచి యే
మికతల్ సేయఁగ సాహసించెడినొ ? నామేలెల్ల రమ్యమ్మెయ్య న
మ్మిక నాపై నిఁకనైనను జెపదె ? యేమొ ? వాని తెప్పెట్లొకన్ ! 20

ఉ. వేకకఁ గాఁ దఁటుచు మది వెక్కసమించుక లేక "యొడొయం
గూడఁగఁ దెమ్ము" టంచు ననఁగూడునె? విత్తము కారణమ్ముగాఁ
జూడని మాడ్కిగా మఱి బొజుంగులఁ గూడినఁ గొంతఁ గూడుఁగా
కేడవి యిట్టి త్రపము? లేమని చేసితి? నేను మిత్రురో! 21

క. నాలావణమునఁ గులమున, కే కానికళ్లకుఁగల్గె నిహిహీ! యిటుపై
నాకత విన్నను గోయక, యే కాముకు లిచ్చగింతు! రిల వెలచెలులన్. 22

ఉ. ఎంతటి మానహీనతలో! మఱెంతటి యేవము లేని పందలో!
యెంతటి బుద్ధిశూన్యులో? మఱెట్టివిగాఁడో! విటకాండ్రు, బోగపుం
గాంతలొసయ్చు హేయములు కన్నులనిండఁగ నెప్డు మాచుచున్
బంతమొకింత పూన రిది బాలిశవృత్తిగఁ జూడ రక్కటా! 23

శా. తాగ్రుంబోతుల బుద్ధిహీనత గదా! ద్రవ్యమ్ము సారాయికిన్
రాఁగా హేతు, వదెంత కట్టుచెడినన్ రాకుంరే? నా రహో!
బోగంపుంగోల, మట్లనే విటులకుద్భోగాప్తి దుశ్శీలమై .
బీగం బూడ్చినపెట్టెయై యిటుచెడెన్ బెంపేచి నానాఁటికిన్. 24

క. ఇక్కరణి నన్యయోషలఁ, జిక్కియు నవ్యాయమునను జెయ్వులఁ దనరం
దక్కించికొనియె విటులకుఁ, దక్కినసంగతులపైని దలఁపుం గలదే? 25

ఉ. పువ్వులవిల్తు పోరఁ గలపోఁడుములెల్లను నొక్కరాత్రికే
యవ్విటుఁ డవ్వెలందియును నాని సుఖించి, ర విట్టి వట్టి వం
చెవ్వఁగఁ దెల్పనొప్పును? నదేమిటి? కింత కెఱుంగనట్టి వా
రెవ్వరు? పత్నులన్ బహువు లీసుఖ మందరె? యంతకెక్కుడే? 26

ఆ. వె. కుక్కుటమ్ములంత గొక్కురుక్కో యనె, నలముఁదొడఁగెఁ జల్లనైనగాలి
చుక్కవాడిచెఁ దక్కుచిక్కులు తటిగొ, న, బ్జాక్షి వెల్లనాయెఁ జాలె రేయి. 27

ఉ. అంత నుదారుఁ డచ్చెలి యొనూరముగాఁ దను సాగనంప న
య్యంతవిలాసముల్ వ్యాపయ మెల్లెడ వేళ్లు ఘటింప సంకేతున్
ధ్వాంతమడంగియుండ్. దనయెదం గలధ్వాంత మనంతమై తగన్
జింతమఱింప లేక యలచేడియ నెంచుచు నింటికిం జనెన్. 28

తే. గీ. సారసమ్ములు వికసింపఁ జక్రవాక, జంపతుల కింపు జనియింప జగములెల్ల
నంధతను బాసి మోదింప హాయిబెంప, రవి యుదయమందెఁ గుముదినీ ప్రవులు డిందె.

చ. అటు లొక కొంతకాల మలయబ్జముఖీమణి పొందు నందుచున్
విటకులశేఖరుం డయి వివేక మొకింతయు లేక స్వీయమా
తటకము మాటయే తలఁపఁగానక యుండెను సంత దల్లి యు
ప్పటి చరితమ్ము కొంత విని పంపెఁ దదానయనార్థ మాప్తులన్. 30

ఉ. పంపినవెట్టులో చెలిఁ బాయఁగలే కెడఁబాసి "యుత్తరం
బంపుచునుండుమీ?" యనుచు సాదర ముట్టిపడంగఁ బల్కి, నై
లింపనివాసమున్ దొరఁగలేక యెవండురు నష్టపుణ్యుకా
ర్యంపుటవస్థ మెల్లఁ దనద్రైచనె నీరతిఁ జింతనొందుచున్. 31

శా. "అయ్యజ్ఞానఁ గన్నకన్నులనె భార్యన్ జూడ నేతెంచుటల్
డాయజ్ఞానమె రాజఁ గన్నకనులన్ సాఘున్ విలోకించినన్
హేయపుప్రక్రియఁ దోఁపకున్నె? యదిగా కీలోకమం దెన్న నే
స్త్రీయారత్నము వారకామినులవాసిం జెందఁగా నేర్చునో? 32

మ. అనుగున్ వెన్కకు లాగివేయుటకు నయ్యబ్జాక్షి సాంగత్యమే
కడుసామర్థ్యముఁ జెందియున్నపుడు వెన్కన్ దోడు నీవేల? యో

గాదుగా? యీనుడిగాలిఁ గూడిననుఁ జిక్కుల్ వెట్టుటల్ మాని నుం
దడుకున్ సాఁగగనిమ్ము నామనవి నీ వాలింపు మిప్పట్టునన్. 33

ఉ. ఈవును గాలియుం గలసి "యేణదృశన్ విడనాడి యేగు టొ
ప్పే? కల" దంచు న న్నిపుడు వెక్కసపుఁ దిప్పఁ దలంచినా రహో!
దైవబలమ్ము చాల దది తల్లిఁ దా నవతార మంది న
న్నీవిధి లాగుచున్న దిపు డేమియుఁ జేయుదు మాతపత్రమా. 34

మ. జన మీ వయ్యు జనమ్ము లెక్కతన నుచ్ఛ్వాసమ్ములం బొల్చు న
ట్టిఁడు నీకున్ సహకారి యౌట నను బోటిం జేర్ప నూహించి నా
యనుకున్ వెన్కకు వచ్చె దీ, వొరులతాపార్తిన్ వారింపన్ గదా!
పుడమిన్ బుట్టితి వాతపత్రమ! నినుం బోలన్ దలన్ దాల్పఁగన్. 35

వ. పదపడి ఘూర్ణకటం బారోహించి యతండు.

ఉ. తల్లిని దుష్టురాలను చెదన్ దలపోయుమఁ దండ్రియోగ్యతా
భ్యుల్లసనంబు నూరక యహో! యని మెచ్చుచు సారెసారె క
ప్పల్లవపాణి చెయ్వుల జపం బొనరించుచు నేగ నున్నవా
రెల్లరు నంతరాయ మగు టెంతయు శత్రులు కోడెరాండ్రకున్. 36

క. రై లేదేఁ గారణమున, జాల మ్మొనరించి వెనుకజరగినచో నా
వ్యాళోలుఁ దదియుఁ "దనకన్, కూలించెడి జాలి" యనుచుఁ గొండొక నెంచున్ 37

ఉ. చిక్కినమేనితో వగపు చెందెడి డెందముతో స్వతఃప్రభన్
దక్కినమోముతోఁ దనదు తాపువకున్ జనుపుత్రిఁ దన్ని దా
మిక్కిలి గారవించి మునుమిందిన దెంచక, పై నొకప్పు డెం
పెక్కఁ గఫక్కి నీతి జనియింపఁ బ్రసంగ మొనర్చె నీగతిన్. 38

చ. మును పెటులైననున్ గృహము మాపిక నీకిఁకఁ గాలిసంతె లొ
టను దెలియంగదన్న? కడుఁదక్కురలన్ దరిఁ జేర నీకు మ
న్న? నయముచందమున్ దెలిసి నాయనకున్ యశ మబ్బఁజేయు మ
న్న? నెనరుగల్గు మన్న? దరిద్రాణంబు వ్యయింపకు మన్న? నమ్మఁగన్. 39

ఉ. ఏపని కేడకేనియును నేగిన నయ్యెడ గేహవిస్మృతిన్
గాఁపుర మాచరించు టది గాదు గదన్న? కళత్ర మెంతయుం

దాపము నందుదుష్కృతులఁ దారకుమన్న! యొకింత పూర్వులన్
దాపసచర్యలన్ దలఁచి తద్గతి నిల్వఁ గదన్న! మేటివై. 40

ఉ. వచ్చెడి రైతులన్ గని జవా బెవరిత్తురు? సాహుకార్లకు
న్నచ్చెడిరీతిఁ జెప్పఁదగు నాయకు లెవ్వరు? తండ్రి నాఁడె తా
నిచ్చినసొమ్ము పుచ్చుకొను టెవ్వరు? కోరెడివారి కప్పు లి
ప్పిమ్పు టదెవ్వ? రెక్కడికి నేగిన నక్కట కాఁపురమ్ములా? 14

తే. గీ. ఎన్ని జన్మమ్ముల జేసి! రెన్ని యగ్ని, హోత్రములు తెచ్చి? రెంతటి కన్నమిడిరి
భూము లెందరి కిచ్చిరి? పూర్వు, లందు దుర్వ్యయంబింతలేమ దుందుడుకు చనెనె?

తే. గీ. ఎంతదరిద్ర్యంబు ముందు నీవింటనుండి, తీసికొనిపోతి! వామీఁదఁ దీఁగకతన
మరలఁజంపినదియెంత? యెఱుఁగుదే? క్షమాధ? యిది యెల్లనెయ్యెడ మణఁగిపోయె.

ఉ. ఈగతిఁ జెల్లఁజేయ వన మెక్కడి లెక్క? ధరాపురందరుల్
జోగులుగారె? యోన్నృపులఁ జూచుటలేదె? యి దిట్టులుంచు మే
లాగు సహింతురా? సకలలక్షణముల్ గలభార్య యుండఁగా
భోగపుఁదొత్తులన్ మరగఁబోయెడినీకత లాలకించుచున్. 44

ఉ. వత్సరమైనఁగాదు జనవంద్యుఁడు తండ్రి గతించి, నీకు నే
తత్సమయమ్ము నిమ్మియిఁ దార్చెటమాని యయోగ్యతాఖనుల్
కత్సిగ లగ్రిజాతులకుఁ గూడనిచీకలు లంజెముండ లం
దుత్సుకతాధరంబు గొనటొప్పునె? కర్మము కాలిపోనఁగన్. 45

ఉ. వింటిని నీమవైఖరులు వీనుల నూచులు నూడినట్టు లే
యంటును సొంటు లేని కుల మక్కట! గంగను గల్వ నిన్నఁగై
కొంటిమె! కొంటె మిత్రులను గూడుక గాడిదరీతి భోగపుం
గుఁటలయిండ్లు దూరెదవె? కూళవె! గోలవె? బేలవే? సుతా! 46

శా. అన్నా! వైనఁటు బ్రాందియంట వినికీయం టక్కటా! నీవు నీ
విజ్ఞానం బెటులబ్బెరా? ద్విజకులావిర్భూతియుక్ బానకున్
మున్నెచ్చో వినలేము నీదుతలనే మున్గెక్ మహాపాప, ము
చ్ఛిన్నంబయ్యెఁ గులమ్ము నీకతన ఛీ! ఛీ! గోత్రవిధ్వంసకా!

చ. నయము భయమ్ము నెమ్మదికి నాఁటఁగ దల్లి యొనర్చుబోధ య
మ్మయి విని మోమువంచి పయిమిక్కిలి యుత్తరమీక "యెవ్వఁ డ

ప్రయాణములోని చెయ్వులను వ్రాయక యిప్పుడే దెల్పె" నంచుఁ ద
ద్ధముఁ దనలోన సిగ్గిలు సుదారుఁడు లో మఱియొండు దోఁపమిన్. 47

తే. గీ. అట్లు వినయంబుగని యయి యున్న పాన్థులకు సయితము లేదని మగ్ధుఁ గాంచి
లోననించుక చింతించి లోలహృదయ, యగుచు నాసతి దానిట్లు ననియె మఱియు. 48

చ. ఎఱుఁగక చేయు కార్యముల కేమి? యిఁకేనియు బుద్ధిగల్గి యు
ద్ధురితము వాయఁ బొందె గురుదోషనివారిణి గంగ కేగి యు
క్కళ మెయిఁ దండ్రికిం గతులు కల్పనచేసి పురమ్ముఁ జేరు ట
త్పరమును గాకయున్న యిటుసల్పుట యొప్పగునంచుఁ బల్కెడున్. 49

చ. "ఒకవివసిగ్గడంప నిది యొక్క యుపాయము గల్గె" నంచు నో
ప్పిదముగఁ దల్లియాజ్ఞ గొని పెద్దలఁ గొందఱి నామె తోడుగా
సదమలబుద్ధులన్ బనుప సాయముగాఁ గొని యాత్రఁ జేగ న
మ్మదనవారాలయమ్మ పరమప్రథితార్థపురాణి గాశికిన్. 50

సీ. అకగద్గునకు వింతలై స్వాంతమును దన్పు దేవళమ్ముల దీప్తు లావహిల్ల
నిరుపల్కులను నభోంతరము దాఁటిన మేటి మేడలసౌధ మిర్మిట్లు గొలుప
నెటఁజూడ నచటనే యింతయాచ్ఛాదనంబును లేని లింగాల పొలుపులెసఁగ
నాలుశాస్త్రములు నధ్యయనంబు నొనరించువిద్యార్థులెల్లెడ వేడ్క నింప

తే. గీ యెన్నియో దేశములనుండి యేగుదెంచి, యట్టిత్రైర్థిక జనము లెప్పట్టుననఁదగ
నూత్రిపట్టినగతిఁ బొల్చు సురనది పరిసరమునం దొప్పుఁ గాశికాపురవరంబు.

తే. గీ. ఎన్నియో ఘట్టములు, నటనెందఱెంద, రోమహాత్ములు సన్న్యాసు, లామహాను
భావులను గొల్చి జ్ఞానమ్ముబడయుగేన్తు, రెల్లయెడ నొప్పు నప్పురం బింపు నింపు.

శా. గంగాస్నానము నాచరించి పిదపం గాశీశు సేవించి మీఁ
దం గామామరకల్పవృక్ష మగు తద్భాగ్యన్ విశాలాక్షి భ
క్తిం గేల్మోడిచి మ్రొక్కి మాధవముఖాదిత్యార్చనల్ సల్పు ప్రా
తాంగుల్ వేలకువేలు వొల్తు రట నిత్యంబున్ వినుత్యర్థులై. 53

ఉ. తాదృశమైన యప్పురముధన్యత నెవ్వఁడు సెప్పఁజాలు? బ్రి
హ్మాదులు లోకజాలము లయంబగునప్పుడుఁగూడ దాని గౌ
రీదయితుండు శూల మలరించి తదగ్రమునందు నిల్పు సం
కేదగు దానిసాటి? నతియింపఁగఁ జెల్లదె? కాశికాపురిన్. 54

ఉ. ఆపురిఁ జేరి యాతఁ డటఁ నాచరణీయము లైనకృత్యముల్
వే పచరించి దానములు వేలకువేలుగ నిచ్చి భూమిదే
బాపల గొండటిన్ దనిపి పైఁ గయకేగి యటన్ బితృప్రియా
వాపవిపూర్తిఁ జేసి యట సాఁగి స్వదేశము బోవుదెంచుచున్. 55

చ. తిరిగియుఁ గాశికేగి యట దేవళముల్ మఱికొన్ని చిత్రముల్
పరిపరిగాంచి గంగ నటఁ బట్టఁ బ్రయాగకు నేగి తత్సరి
త్సరసముఁ బట్టి యప్పురిని సొంపగు కోటఁ గలట్టి మేటియ
బ్బురములు సూచి యేగెఁ దనప్రోలికి నాప్తుఁతోడ వేడుకన్. 56

తే. గీ. జనని కభిషేక మొనరించి పతియుఁ దాను, సమ్మహోగంగఁ బూజించి యగణితముగ
విప్రులకు నన్నదానంబు విస్తరించి, తల్లి సంతసమంద నుదారుఁ డంత. 57

శా. సంసారస్థితిఁ జక్కఁబెట్టుకొనుచున్ జాయన్ దగన్ జూచు చా
శ సాపాత్రము గాఁ బవిత్రనము మెచ్చన్ జేయుచున్నంత మీ
మాంసన్ జేయక తల్లి యాతనిమెడన్ మర్యాద నీక్షించి "ప్రి
ధ్య సప్రక్రియ తగ్గ" నంచుఁ దలఁచెన్ దత్త్వంబు నూహింపమిన్. 58

ఉ. "అచ్చెలిఁ జూచు టెట్టు? లిఁక నయ్యెడ కేగునుపాయ మెద్ది యే
యొచ్చెము చేసినన్ జనని యొప్పడి!" యంచుఁ దలంచునంతలో
నచ్చపలాక్షి యయ్యెడకు నాత్మపురమ్మును వీడి మున్నె తా
వచ్చుటఁ జేసి కమ్మఁ దగ వ్రాసి తనంతన యంపె దూతికన్. 59

ఉ. వచ్చిన దూతిచేతి "కిదె వచ్చితి" నంచు లిఖించి యిచ్చి పో
నిచ్చి మనమ్మునన్ బెరుఁగు నిచ్చలు మోమునఁ దోఁప నంతలో
హెచ్చెడి యుత్సుకత్వమున కెద్దియుఁ బారము గాక యేగెఁ దా
నచ్చపలాక్షిఁ జూడఁగ నుదారుఁడు లోన భయమ్ము గ్రమ్మఁగన్. 60

ఉ. "ఉత్తరమైన వ్రాయ విది యుక్తమె? నీ" కని యింతి పల్కఁ జో
"నుత్తరమేమి చెప్పుదు సఖీ! మది నెంతటి పేర్మి లేనిచో
నత్తరళాక్షి తాన యిటకై చనుదెంచునె? యెంతదూర మ
ప్పత్తన! మంబ హేతువునఁ బంకిలచిత్తుఁడనైతి నక్కటా! 61

ఉ. అంబయుఁ గాదు హేతువు రహస్యమునం బొకయుత్తరంబు నే
నంబుజనేత్రికిన్ బనుప నాపె నివారణచేసెనే! నిమి

త్రం బీటు వేఱుగా దొకస్వతంత్రత లేమియొ కాదు కాదు డెం
దం బదియేమొ! యెప్పనికిఁ దార్చిన నేరదు నాఁటనుండియున్. 62

చ. కలికియొ కారణంబిచటఁ గాఁదగు నత్తరళాక్షి వీడి నే
వెలికరుదెంచు టాదిగ నవీనవిధం బొడఁగూడె నేమియుం
దలఁపదు చిత్త, మేమిత్రికతం బని చింత యొనర్పఁ దాను నం
దులఁ జొరబాఱ దిప్పటికిఁ దోఁచె నిజమ్మిది" యంచు నెంచుచున్, 63

ఉ. నేరము సేయుమానవుఁడు నేతకడన్ జనుపోల్కి మోమునం
దీఱని దైన్యమున్ మతి మదిన్ గడుభీతియుఁ గొంతలజ్జయున్
వారక తోఁప నచ్చటులవారిజలోచన యున్న చోటికిన్
దారె నుదారుఁ డట్లు నగుఁ దన్వులపట్లఁ గృతాపరాధికిన్. 64

క. నలుగడలు గాంచి పదపడి, జలజముఖి వసించుగృహముచాయఁ జని యటన్
గలకలికిఁ గాంచినంతన, పులకలు గనుపట్టె మేను పొంపిరివోయెన్. 65

చ. తనుఁ గని మాటలాడ దొకదండము వెట్టదు మోము నెత్త ద
ద్వనరుహనేత్రి యంచు మది వంత యొకింతయుఁ గాంచ కల్లన
ల్లనఁ బ్రియురాలి దగ్గఱి విలాసగతిన్ జని గిఁట్టి మోము నె
త్తిన శతపత్రనేత్రి యొకతీరున నవ్విలు జాలువాఱఁగన్. 66

ఉ. కొండొకసేపు నెప్పమెయిఁ గొంటెతనమ్మున మిన్నకుండి "నీ
మిండతనంపుఁ జంద మిది మేలుగనున్నది యిట్టివాఁడవా?
వెండియు రేపె వత్తునని వెళ్లినదే యొకసందు చేసి రా
కుండుట నీకుఁ జెల్లె నిటు లొండొరు లెవ్వరు నేర్తురే బళీ!. 67

చ. ఇరువదియేండ్లప్రాయ మదియే గనునంతకు మిన్నకుండి పై
"నిరువదియేండ్లమున్ను చదు" వన్నటు లే నిను గట్టికొంటి యి
క్కరణి విచారమందుటకె కాక సుఖమ్మునకా? నిజమ్ముగాఁ
బురుషుల నమ్మమానినికిఁ బొక్కుటదక్క మఱొండు గల్గునే. 68

మ. మఱు లేకీకరణమ్ము గాంచకయె సమ్మన్నమ్మిక ల్చాలకో
కుతుకంబుల్ నెఱవేఱకో సిరులు లేకో యేదియో మూడియో
సతికిన్ భర్తకు నత్తవొక్కయెడ నీసఖ్యమ్ము చేకూఱదు
ర్మతియై దానికి దైవ మెయ్యదియొ సంపాదించుఁ బ్రత్యూహమున్. 69

చ. నినుఁ గనుఁగొంట కిక్కరణి నేవయి వచ్చితి నన్న మాట యే
వనితయు నేని మాకొలము వారలలో విని నేరి నవ్వకుం
డునె? యెటు లేని సాకల కిటుల్ చను టొప్పునె? దానికేమి ప్రీ
తినిగనఁ జేసి తిట్లుసుగుదెంచుళ్రియమ్మున కోర్చె యెమ్మెయిన్. 70

ఉ. "లంజెగదా!" యటంచు మది లక్ష్య మొకింతయు లేమి వీడితే
నిం జనుగాని యొక్కచెలివీడి యొకొక్కొకఫక్కి నొప్పు "నీ
మంజులవాణి యిట్టి" దనుమాదిరి నిర్ణయ మాచరింప న
క్కంజభవుండు నేరఁ డనఁగా నొకపాత్రి బొజుం గెలుంగునే. 71

చ. వెలచెలియై జనించి కనువేఁదులు చెందినపట్ల దానికిన్
గలుగుట యబ్బురంబె! పలుకట్టము, లొడ్ల ననంగ నేల? చం
చల మగు నాదునెమ్మ 'ముచందము నింద యొనర్తుఁగాక యే
లలనలు గాంచిరో? సుఖములన్ కలవుల్ తలకెక్కుపిమ్మటన్." 72

చ. అని పలుమాఱు దూఱుచెలియన్ దగుమాటలు సెప్పి కొంత సి
గ్గున కగు చెయ్యులన్ గొశపి కొంత క్రియమ్ముగ నుప్రిసన్నఁగా
నొనరించి మించుపేర్మి దళుకొత్త "సఖీ! నినుఁ బాయ టాదిగా
మనమది యే మొకో! పనికిమాలిన దయ్యె నిజమ్ము నమ్ముమీ. 73

ఉ. ఇంతియు కాకయున్న నిఁక నేపని నేనియు మాను టొప్పఁగా
కింతిరొ; నీకు నుత్తరము నేనియు వ్రాయునె? యంత పంపనే?
కంతునిసాక్షి నేఁడు నినుఁ గాంచితి నెమ్మన మెప్పటట్ల ని
శ్చింతత గాంచె నింతయును సిద్ధము నమ్మిన నమ్మకుండినన్. 74

ఉ. వచ్చినతత్క్షణంబ మగువా! యలకాశికి నేగి వాఁడఁ బై
నచ్చుగఁ యాత్రఁ జేసికొని యక్కడనుండి యు మొన్న వచ్చితిన్
బచ్చనివింటి జోదుకృప వచ్చితి వంతయనీవు, యాత్రకున్
వచ్చెఫలంబు, నిక్క మిది వంచనసేయఁడు దైవమెవ్వరిన్. 75

ఉ. ఈవును నేనునుం గలసి యిద్ద్యెడ హాయిగ నుండవచ్చు సౌ
ఖ్యావహ మీపురంబు, మనకన్నియు మంచివె కాని తల్లిగా
రీవిధ మొప్ప దామె కిది యించుకయున్ దెలియంగ రాదు కో
పావిలయై 'చో మనకు హాని ఘటించును నిక్క మెమ్మెయిన్. 76

ఉ. కావున నీవు గోప్యగతిగా వసియించుము నాదు నామ మెం
దే వదియింపఁబోకు వచియించిన మాత్రఁ యేమిగాని యే
యోధికైన గోప్యగతియే కడు శ్రేయముఁ డాఁగునంచు నీ
కేవల మెంచఁగూడ దపకీర్తియుఁ గీర్తియు రెండు నట్టివే. 77

ఉ. పేరగు దాన వీవు, కడుఁ బెంపుగలట్టిది మాకుటుంబ, మీ
కారణ మై రహస్య మది గావలసెన్ మఱియొండు రీతి యే
నే రెటు సంచరించెదరో యేరికిఁ గావలె నింతవట్టిలో
నూరకుగాని యిట్టిపురి నొక్కని కొక్కనిజోలి గల్గునే. 78

క. మీపురము లొక్కపదియౌ, మాపురి విడఁ జీసి కట్ట మానిని! వీనన్
గాఁపురము సేయుగేస్తులు, దాఁపునఁ గలవారిపేరె తా మెఱుఁగరనా 79

తే. గీ అట్టిసంగతిలో నిటు కథిక మూక, యుంకు మాపెక్కి, యన్యోన్యమును నిన్ను
నెవఁడుగురించి మాతల్లి కెఱుఁగఁ జెప్పె!, నట్లయిన భయ మేల? నదియుఁ వినుము 80

ఉ. మీపురిలోన నే సలుపు మిక్కుటపుం బను లట్టు లుంచు మే
యోపను లేను నీపనికయింట నొంచర్చితి వాని సన్నిటిన్
దాఁపక చెప్పితా రెవరొ తల్లి, కిదెక్కడివింత? జాఁరతా
వ్యాప్తి తానయై జగముపై కనుగన్ నిజ మింత కోమలీ." 81

క. అనవుడు జలజాక్షి యుబ్బ, గ్గన మండిన పగిదిపోఁపఁ "గులదిరగ న
న్నను జూచెదనను టది యె, ల్లను బోయెనె? యెంతలోఁ గులటనైతిఁ గటా! 82

క. జాయఁడను దుస్యశము పస, నావల, జోరగతిఁ గూడు నాయకునకు నా
మారమణిఁ గొనిన నీయుప, కీరితి లే దిపుడు నీకుకృప వింటి నిటుల్. 83

క ఏలంటె వమ్ముఁ? దానై, వేలవేళ్ మైపులున్న వీటికి నీ కి
ల్లాలనుకొంటి "గలదే, రై" లను మళ్లైనఁ దనకు రానేల? యిటుల్. 84

క. యోగినిగతిఁ గాలమ్మొను, నేఁ గడపుచునుండ నీవు నేరుపమై నన్
భోగినిగఁ జేసి చింతా, భాగినిగాఁ జేయునుంటి పాడయితిఁ గటా! 85

తే. గీ. మొదల మాతల్లిమాటల మోసపోక, పురుషసాంగత్యమున బుద్ధి పోవనీక
యుండ నాముండయొక్కనికొప్పఁ జెప్పె, వానినానాఁడ పోఁగొట్టి వ్రతముగొంటి.

ఉ. దానికి నంతరాయమయి దాపర మైతివి దానికేమి నా
మాన మెఱుంగకే కడుకుమాళిమునన్ దగునిన్నుఁ జూచి మా

యూనిధిగా గణింప కకటా! తుద కెందుకుఁగాని పడ్డనై
బానిసతోఁ ద్రనై చెడితి భారము నీకయితిన్ వృథాగతిన్. 87

ఉ. ఎందుకు సృష్టిచేసెఁ బరమేశ్వరుఁ డీచెడుగుంగొలమ్ము? పై
నందముఁ జందముల్ గలుగునట్లు లొనర్చఁగ నేఁ? చేసెఁ బో
పందల కెల్ల విందొనరుపన్ విధియింపఁగ నేల? యూరకే
కుందఁగఁ జేసి యిక్కరణిఁ గుత్తుక గోయఁగ నేల? యక్కటా. 88

ఉ. అందముఁ జందముం గనియొ యాదరము న్నిజ మంచు నమ్మియో
పందలు వేలు నీయఁదగు వాఁడనియో యొకమాయ కానికిన్
డెందము నమ్మి వానికిఁ గడిందిగఁ బ్రాయము ధారవోసి యం
తం దను వీడ నేడ్చెడియనాథకులమ్మునఁ బుట్టఁ జెల్లునే? 89

చ. కలుగుట దుర్లభం బొకఁడుకల్గినఁ బెద్దరవాన్య మందుకున్
దలరక యొప్పుకొన్నఁ దుదిదాకను నెగ్గము వానిచెల్మి యే
వెలచెలియేని యొక్కయెడఁ బ్రీతియొనర్చుట తప్పిదంబు, పం
ద లయినఁ దప్ప నొండుగతితన్వులు దీన జనింపు టొప్పునే. 90

చ. కలిమిని లేమి నొక్కగతి గారవమున్ బచరించుచున్ దళ
త్తళ గల జవ్వనమ్ము దిగఁ ద్రావినపిమ్మట నేనిఁ బూర్వప్రేం
జెలిమి యొకించుకేని యెడసేయని పెన్మిటి గల్గునేని కం
జలి యొనరింప నొప్పు దివిషత్పతి యంచిన సానియేనియున్. 91

సీ. తగినసంతాన మ్మదయమంద "నాయనా!" యని వార లెవ్వాని ననఁగవలయు?
అన్నదమ్ములు గొరవార్పు లుండిన వారు తల లేచునంచు నెత్తంగవలయు?
తనఁగన్నతండ్రి యుత్తముఁడేని యతని మొగమ్ము మిగతిని దాఁగాంచవలయు?
ఏదేని శుభకార్య మేతర నెవనితోఁ గాంతుమైఁ బీఠ మెక్కంగవలయు?

తే. గీ. నక్కటా! తాను బాడగు టట్టులుండ, వెతకముందటివారల వెలిఁ దార్చ
రో వెలందుల ప్రట్టువుల్ రోఁత గావె, యెఱుఁగనేర రీ యర్థమ్ము హీనమతులు.

ఉ. అట్టిపులమ్మునం దెటులనైన మరేమి పురాకృతమ్మునన్
బుట్టినదానికిన్ వగవఁ బూనిన లాభము గల్గఁబోదు తాఁ
గట్టిన కర్మముల్ తుద ఫలించక తీఱునె? యిప్పుడేని యీ
గుట్టు నెఱింగి యొక్కరునిఁ గూడి దినమ్ములు పుచ్చఁ జెల్లదే? 93

ఉ. ఒక్కనిఁగూడి కాఁపురము నొప్పుగఁజేసెడి చానపొందులే
ఫక్కిని జారుఁడన్న దురుపద్రవముల్ గలిగించు వింటి నీ
చక్కనిగాక సర్వజనసమ్మతమై మఱి యాఱు మాఱుఁ జే
రెక్కుడి నగ్రిజాతులకు హీనకులాంగన తోడి కూటముల్. 94

ఉ. కావున నన్ను జారగతిగాఁ గయికొందువయేని నొల్ల "భా
ర్యావిధిఁ జూచుకో" మ్మనుచు నప్పుడ చెప్పె మదంబ, దానికి
న్నివెటు లొప్పికొంటి? వది నేఁడిటులన్ గినుకింతె? మాకొలం
బేవగ దైన మాసరణి యేవము నైఁప దదెన్ని భంగులన్. 95

క. అనవుడు నుదారుఁ డచ్చెలి, కను "నే లోకోక్తి నంటి నది నీకింతన్
మనము నలయించెనే? యే, మని భార్యఁగ నిన్నుఁ జూడననుకొంటి? చెలీ. 96

ఉ. చక్కఁదనమ్ము లేదో? గుణసంపద లేదో? వయస్సు లేదో? బల్
తక్కులమారి గావో? వివిధమ్ముగు విద్దెలు నేరవో? నినున్
జిక్కనికౌఁగిటన్ జనవు చేసినపిమ్మట భార్య గీర్యయున్
మక్కువకానె? యేల యనుమానము? మానుము మానినీమణీ 97

ఉ. నమ్మవు గాని నీవు మదినాటినదాదిగ భార్యఁ జూడఁగా
నెమ్మది సమ్మతింతు గనదు నేరము లూరక తోఁచు దానిపై
నెమ్మెయిఁ బూను నీగుణములే కద! యింతకు గారణమ్ము, నీ
సొమ్మకొమ్మ నన్నును దిగ్గుద్దిగ మాటలు వేయునేటికిన్. 98

గీ. విప్రులకు నాల్గుజాతుల వెలఁదులందుఁ, గలదు స్వాతంత్ర్య 'మది నేఁటి కలియుగమునఁ
గాదనుచుఁ గొందఱడ్డిరి గాని యింత, మాత్రమున, బోయెనే? పూర్వమతమునకియ.

సీ. బ్రాహ్మణుఁడై పుట్టి పరమచండాలితో సంసారియైన విశ్వాసి యొకఁడు
మాగుర మున్ జంపినముండమోపిని గట్టికొని గృహస్థయిన ఘనుఁ డొకండు
ఏకమత్యమున కియ్యవి మప్పనుచుఁ గులాచారముల్ వదలినజాణ యొకఁడు
"పింగాళి చిప్పకు వెండిగిన్నెకు భేదమున్నదే!" యనిపొడి యోగ్యుఁ డొకఁడు

తే. గీ. వీరలేకద! సభలలోఁ బెద్ద లిపుడు, మనకు మర్యాద వీర లేమని యొనర్ప
రింతకును దివ్యకంతున కెవఁతోడ, నేమిపని? వెలి యాతని కేమి సేయు?

చ. జనని గతించు దాఁక నొక చందమునన్ జననిమ్ము మీఁద ని
న్నును స్వగృహమ్మునం దిడుచు నూతనబుద్ధి యొకింత లేక గా

జన మదిరెల్ల నీకు నుపచారము సల్పెడు నట్లొనర్తు న
న్ననియెడి వాఁడొకండు గలఁడా? మఱి తల్లి కొకింత జంకెదన్. 101

ఉ. దాఁపఁగ నేల? విన్ము మును తండ్రి గతించెడు వేళ ద్రవ్యమున్
మాపి మదంబతో "నిది త్రిశుద్ధిగ నీ మరణంపు వేళ నీ
పాపనివాని కిమ్మిచట నుంచుక యేని వ్యయింప కంచులో
నోపినమాత్రముం గలిపి యుచ్చగతిన్ బొనరింపఁగాఁదగున్." 102

తే. గీ. యౌవనము ధనసంపద యాధిపత్య, మవల నవివేక మియ్యవి యందుఁ నొక్క
టొక్కటియె మానవుని నివియొకటనన్ని, యునుబొసఁగ నేనిఁ జెప్ప నేముండు సాధ్వి?

చ. నవనవయౌవనుండయిన నందనుఁ డొప్పుగఁ గాఁగి చల్లనా
రి వెలయాలభంగి నొకరీతికి వచ్చెడునన్న జాగరూ
కవిధిని సర్వముం బయినిగాంచుచు ద్రవ్యము చేతి కీక పై
న్యవహృతిశాలి యైనయపు డంతయు వానికిఁ జెందఁజేయుమీ. 104

చ. అని పలునీతులన్ దెలిపి యా పెను సర్వము నప్పగించెఁ గా
వున మన కామెసమ్మతిని బూనక చెల్లదు దానఁ జేసి ని
న్ననిచెద వేఱుగాఁ, బిదప నోపిక వెట్టితివేని యెల్లగన్
బనిఁగొను దానవై మెలఁగవచ్చును బొచ్చెము లేనిరీతినన్. 105

చ. అనవుడు నవ్వెఁదియను నక్కట? యెందుల కింతసోద? నీ
జనని శతాబ్దముల్ సుఖవశమ్మున నుండెడుఁగాక నీధనం
బును సుఖముండెఁగాక నను మోసముచేయక భార్యగాఁగఁ జే
కొను టది చాలు వచ్చెఁ బదికోటులు దానన నిక్కమింతయున్. 106

చ. ధనము గడించియుంచి యది తాము గతించెడివేళ నెవ్వరే
నినిఁ గొనిపోయిరే? జగతి నీతి యనీతియుఁ గీర్త్యకీర్తులన్
దనచనువేళ వెంటఁబడుఁ దక్కినదంతయు దూరదూరమై
పనుపడు దీనికేమి! పదిపాళ్లుల నీకృప గాంచఁగల్గితిన్. 107

ఉ. పిన్నటనాఁటనుండి కడఁబెంకెతనమ్మున నుంటె కాని మా
కన్నెలఁబోలె నెల్లరకుఁ గాళ్ళకు మ్రొక్కెడి దానఁగాను నా
మున్నరికంబు పాగుటకు మూలమవై ననుఁ గొంటివీవు లే
కున్న మఱేమిలే ధనము, లల్లము చల్లఁబడెన్ని జన్మగన్. 108

ఉ. ఏమనఁ? దెల్పరాన విను మే మొద లీకొలమందుఁ బుట్టలే
దేమనుజుండు నన్ననెనొ యెవ్వతె తల్లియొ యే నెఱుంగ న
న్నే మెయిఁ దాను గైకొనెనొ! యియ్యది పెంచియుఁ బెద్దఁ జేసి బల్
క్షేమము లోలి నేర్పెఁ? గులనీతికిఁ దావలమై చెలంగఁగన్. 109

క. ఆనీతులు నామది కిం, తేనిం జొరబాఱ వేగతిన్నేర్చును? చి
త్తైక్యనెగడనిపత్తికి భా, వానియతి న్నేర్పఁ, గులమ చను ముఖ్యంబై 110

క. సంగీతము సాహిత్యమ్ముం గొమరగు నభినయమ్ము మగుదలకెల్లన్
సంగతములగుట నారుఁ బో,సంగున్ దగుపాటిప్రజ్ఞ జగదీశుకృపన్. 111

ఉ. ఇంతకు నాకొలమ్ము మొద లెయ్యదియో విననైతిఁ దల్లితోఁ
బంతము పట్టికోరినను "బ్రాహ్మణకన్య" వటందుఁ బల్కె నే
వింతవిధమ్మున న్నను వివేకవిహీన మదంబ గాంచి ని
శ్చింత మెయిన్ ద్యజించెనొ యిసీ! పశుపుంగొల మాశ్రయించితిన్. 112

ఉ. కోపమువచ్చు మీ కనుచుఁ గొంకక పల్కెద మీకొలమ్మునం
దేపగుచున్న దీయధమవృత్తి యదేమనఁ! బెద్దవృద్ధు తా
నేపసిపాపనో ధనమునిచ్చి కొనున్ గనున్ నఁత మృత్యు, వా
పాపిని మమ్ముఁ బోటుల నపారముగాఁగని యిట్లొనర్చెడిన్. 113

శా. పోనీ స్త్రీలు పునర్వివాహమునకున్ బోరామి వాదింతు వి
జ్ఞానుల్ పండితు లేమిపాపమొ! ధనాశన్ గూఁతు వృద్ధాత్ముఁడౌ
వానిన్ జేర్చునపాత్రుఁ గూడ దన రవ్వాఁడిచ్చు నన్నోదనా
లానం దమ్మమెయిన్ భుజింతు రిది యన్యాయమ్ము గాదందునే. 114

శా. కన్యావిక్రియ మాఁగలేని యలవిజ్ఞానుల్ మత్రేచుంచుఁ దా
మన్యాయమ్ముగ స్త్రీ పునఃపరిణయవ్యాపార మాపంగ వే
డ్కన్ యోజింతురు రెండునుం దగనివే కాఁబట్టి యందొక్కటన్
మాన్యత్వమ్ము మఱొక్కటన్ దోసఁ గదే మాడిక్కన్ బొసంగింతురో. 115

మ. పతిలోఁ గొండొకకాలమున్ సుఖములన్ బ్రాపించి పైవాఁడుపో
ఫుతలిన్ మేటివిరక్తిమై సకలమా భోగమ్ములన్ వీడి బో

డితలఁ దాల్చి యతిస్థితిఁ గనుట పాటింపక దగుఁ గాని చి
న్నతనమ్మందున నాలుగేసులపుడే నా! యిట్టివైరాగ్యముల్. 116

ఉ. అట్టివయస్సునన్ విధవయై యది యిందుకెఱుంగనప్పు డా
బొట్టైన గాంచి కొంద "ఱిసి పూర్వభవం బిటు పెట్టెఁబెట్టె" నం
చెట్టులొ పల్కున్ మఱి యదే పయి నొక్కనిఁ గట్టుకొన్న నాఁ
డిట్టులు పల్కరాదె! యహొ యెక్కడికేగెఁ బురాకృతం బహో! 117

తే. గీ. స్త్రీపునఃపరిణయములు సేయవలయు, నంచుఁ దర్కింపఁగానియీ యబలలైన
బాలవిధవలపట్లనా! పండితులకుఁ, గల్గుపాండిత్యమెల్లఁ జక్కఁగనడమట. 118

శా. సూజన్ మెక్కుచు కాళ్ళనేఁ గదుగర్ శౌచం బటుండంగ లో
నం "జంకర్ మన మిట్టులుంటి మిది యంతర్వాణి లీక్షించి తే
నిం జాలన్ వెలియౌ" నటంచు నొక రేనిన్ వారి వారింప ఱి
క్కొంజాతుల్ శమధర్మశాస్త్రములకున్ గన్పట్టె రెప్పట్టునన్. 119

ఉ. మాలల నంటుకొని జనమాన్యులు, క్షుద్రులు చేసి తెచ్చు భ
క్ష్యాలు భుజింపఁబట్టి గుణగణ్యులు, మీకులమంచు నేఁడు తే
రీలలి సంచరించు ఘనులెల్లరుఁ బంక్తికి నర్హులై పతుల్
గూలఁగఁ బెండ్లిచేసికొను కోమలు లెట్టు లనర్హ లౌదురో? 120

శా. ఆయామూర్ఖ్యపు బండితుల్ గలరుగా! యందెందు విద్యార్థు లే
మీ! యేర్పాటుగ నుండిరే? యచట లేరే? దుర్కులున్ మాలలున్
నీ! యీయెల్లర కందు వేదమయినన్ జెప్పంగఁ దామెప్ప వి
ద్యాయుత్తుల్ కులవంతులై విధవ పెండ్లాడన్ గులంబూడెనే! 121

ఉ. కావున నేను నీపిదప కాలమునందలివిప్రజాతిలోఁ
బావనురాలనై మెలఁగవచ్చును సంశయమేల? భార్యగా
నీవు పరిగ్రహించుటకు, నీతులు జాతులు నానకట్టుకన్
గావలెఁ బూర్వయం, దిపుడు నైకొనువా రెవ? రాపరిచారముల్. 122

తే. గీ. ఎరుపూర్వపుటాచారమెఱుఁగువారొ, వారలకు శాస్త్రము తరవాదియిచటఁ
దక్కువారల కీశోలికపుల దెర్వ, రేని నడిగిన నోరెత్త రిట్టులనిన. 128

ఉ. నావుడు నవ్వి "మాకులమునంగల వైఖరు లిట్టులుండుటన్
నీ విటు లంటి తప్పిదమె? నీచులు మాన్యత గాంచఁబట్టి యీ
యీవిధు లిట్టు లయ్యె నిదియే నవ పూర్వపుఁగాలమైనచోఁ
బావనపుం గులమ్ము లిటు పాడయినన్ బుధు లూరకుందురే? 124

మ. సరసంబాఁడితిఁ బల్కితీవు జలకత్సన్న్యాప మన్నట్లు ని
ష్ఠురమా జవ్వనమందుఁ గాంతలకు నెట్టుల్ గూడు వైరాగ్య? మె
వ్వరికో జంకి యొనర్చు నేమములు నిల్వన్నేర్చునే? జన్మమే
బరువై తోఁచెను భర్తలేనిసతికిన్, బైమాట లింకేటికిన్. 125

మ. పతిపోవన్ బలవన్మతిన్ సతిని దగ్ధభర్త్రంగమందుంచి చే
చితి నంటించెడు ఘోరపుంగ్రతిని వాసిన్ గట్టిపెట్టించి రే
మతిమంతుల్, తగవార లియ్యబలలన్ "బాల్యమ్మునందే వివా
హితలం జేయఁగరా దటం" చనిన నీహీనస్థితుల్ తగ్గడిన్. 126

మ. "పదియేఁడుల్ చనుమీఁదఁ జేయఁదగు నాపై రెండు దాఁటంగ రా
దిదియో! స్త్రీలకుఁ బెండ్లికిం డిటే" యటం చేర్పాటు గావించుచో
ముదిశల్ వృద్ధులఁ బెండ్లియాడుటలు తప్పున్ దానిచేఁ దగ్గుఁ దొం
బదిపాళ్లీ మరుపద్రవం, బదియు విద్వత్సమ్మతిన్ గాఁదగున్. 127

తే. గీ. ఈడువచ్చినకన్నియ నెవ్వఁడేని, వృద్ధునకు నమ్మఁజూప నెవ్విధిని సాగు?
నక్కటా! యెన్నివృత్తులో యవనియందుఁ, బంద లీవృత్తికతన జీవనముగొందురు.

తే. గీ. అప్పవీక్షితు లోకప్పు డాత్మజాత, కిట్టి దురవస్థ గల్గఁ దానెఱుకకల్మి
స్త్రీపునఃపరిణయములు సేయఁబూని, యితఁడు వెనుకదీసెనఁట తల్లియొప్పకునికి.

ఉ. అప్పటికాలమందు నెటులైనను నిప్పటివిప్రజాతికిన్
దప్పని దోఁచ దిప్పని, వృథాఁతి వారలగోడు నోసికో
నొప్పుటకన్నఁ బండితుల కొండొకదోసము సేసు పెక్కులౌ
తప్పుల కొప్పి యీయొకటి తాము సహింప రదేమి పాపమో! 130

తే. గీ. అరయఁగాలేక మిముటు వెలయాఁడ్రిటుంచు రిగాని యీయుగమది నేఁటికాలమందు
ద్రవ్యమిడి పెండ్లియాడినధన్యతముల, భార్యలకు వెల్లఁ జెల్లఁగావచ్చుఁగాదె.

ఉ. సాంకర్యమ్ము తటస్థమౌనటుచు విశ్వస్త్రీవివాహమ్ము వి
ద్యాంకుల్ పెద్దలు గాదటం చనిరి సత్యంబే, యిదొక్కండె యీ
పంకంబుల్ ఘటియించునో యిటు లనన్ బాగౌ దనంతన్ జగం
బింకం బాగొడిపట్లు నీనియమ మిందెవ్వాఁడు పాటించెడిన్. 132

ఉ. భూతి మొగమ్మునంగలుగు పుణ్యుఁడు పొద్దుట స్నానసంధ్యలన్
జేతము జొన్ప వైదికపుఁ జెయ్వులమానిసి నూటి కొక్కఁడే
నీతఁడెఁ గానరాఁ డిపు డిదేట్రికిఁ? బూర్వపుగాథ లేల? వి
ద్యాతిశయంబు మాని బుధు లందఱు దీనికి నొప్పరావొకో. 133

శా. వ్యాసాదుల్ ఋషులై నిజమ్ము లయి తద్వాక్యాల్ భవిష్యద్గతిన్
బూసన్ గ్రుచ్చినరీతిఁ జెప్ప టదియున్ బోకుండె యాచార! వీ
రే సార్వజ్ఞులు? వీరి కయ్యెడల లేదే లేదు విశ్వాస, మీ
యీ సన్లే నెటు లుందు? భ్రష్టులగువారే తన్మతోద్ధారకుల్. 134

గీ. అనుచు నాయాయిగోష్ఠిని వతఁడు వదియుఁ, గొంతతడవు వాదమ్ము దమంతసల్పి
"మనకు నీగొడవేట్రికే? ఘనులు దీని, విందు" రని విరమించి పైపేద్కు దనర. 135

తే. గీ. తమకు ననుగుణమైన వర్తనలఁ గొంత, తడవుఁ డపి యామీఁద నుదారుఁ డింటి
కరిగి ప్రతిదిన మీరీతి నతిరహస్య, మెఁగతి దానిపొందు దా నందుచుండె. 136

గద్య.

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం
బైన పాణిగృహీతయందుఁ
జతుర్థాశ్వాసము.



# పాణిగృహీత

## పంచమాశ్వాసము.



స రసాంతఃకరణా సు
స్థిరగానాభరణ నిత్యచింతితభగవ
చ్చరణ కవితాదరణ సువి
చిర వితరణ కీర్తికామ సీతారామా.

తే. గీ. అవధరింపు మనంతరం బట్లు కొంత, కాలము రహస్యవర్తన గలుగుమీఁద
వారినోటను మఱియు నవ్వారినోట, దల్లి మెల్లసంగతి విని తల్లడిల్లి. 2

మ. అకటా! పుట్టి రోగముల్, మొదటనే యంతమ్ము గావించి పు
త్రికకు యోగ్యుం బొనరించి నా ననుమఁ జేతంబందు నూహించి యీ
సకలమ్ముల్ వెసఁ జేతికిచ్చితి నిసీ! చండాలుఁడై వీఁడు దు
ష్ప్రకృతిన్ మానఁడు నైచ్య మెట్టు లిఁక? నింటన్ వంట లేవిప్పుడుల్. 3

తే. గీ. వేదశాస్త్రమ్ములందు వివేకులైన, రాజమణుల మెప్పించి మర్యాద మిగుల
నార్జనముచేసి రీయగ్రహారములను, బూర్వు లివి వీనికతమున బూడిఁగలియు. 4

వ. అని చింతించి యొక్కనాఁటి భోజనసమయమ్మున కొమరున కిట్లను.

శా. అన్నా! చిన్నతనమ్ము నుండియును సంధ్యావందనాసక్తి నీ
కెన్నంగాఁ గడునెక్కు డిప్పు డది తా నేమయ్యె? బ్రాహ్మణ్యపుం
జెన్నె ల్నిన్విడుచున్న దేమిగతి? నీ వెయ్యేల్ విఁకన్ గోత్రమై
నన్నున్ గాల్చుచునున్న విట్టిపనులన్, న్యాయంబె? నీకోటికిన్. 5

చ. ఎఱిఁగియొ నేరకో మొదట నేవపుఁగార్యము సల్పితీవు వైఁ
దిరిగియు శుద్ధిఁబొందితి సతీమణియౌ కులకాంత యుండ నె
బ్బైటికము మాని యప్పునుపుబిత్తరి సత్తి గుత్తఁగొందువా?
సిరిగల కొంపకున్ గలిగెఁ జేటిఁక మాటలు వేయు నేటికిన్. 6

ఉ. ఎవ్వరిఁ బంపినా వచటి కిచ్చెదుముందఱ నై, తనంతఁ దా
నెవ్వగ వచ్చె? "నెయ్యెడల కెందుల కేగదో!" యంచు నెంచితిన్
అవ్వగదా? దినమ్మున రాతిరి చెయ్యవలె? నీదు వర్తనల్
నవ్వరె? యెవ్వరేనియు, వినాయకుఁ జేసినఁ గోఁతి యయ్యెనే? 7

క. ఏమేమి గలు నాణెము, లామాదిగముండ కిడితి! వారారా రా
సీ! మూర్ఖ! నిన్ను నీపయి, నేమియొనర్చినను బాప మించుక గలదే! 8

క. అని యేమేమో యొడలుడి, కినగతి కనుగుణముగాఁగఁ గెరలి పలికినన్
దనుఁగాని యట్లువినియును, వినని గతిన్ జెవి నొకింత పెట్టక యతఁడున్. 9

ఆ. వె. భయముడిచి పట్టుపగలును రేయును, దాని యింటనుంటఁ దక్క నన్య
మించుకయును లేక యిల్లాలి మాటయే, తలఁపకున్నఁ దల్లి తల్లడిల్లి. 10

గీ. 'అంతకంతకు మొరదమ్యె నహా! వీఁడు, భార్యఁ జూడఁడు వ్యవహారపగతిఁ గాంచఁ
డేమిగతి!' యని యోచితా నేమియనక, తగినవారిచేఁ జెప్పింపఁ దలఁచె నపుడు. 11

చ. అరమరలేక యింటివ్యవహారము లన్నియుఁ జక్కఁబెట్టుచున్
జిరమున నుండి స్వీయకృత్యాసీయుడు నాశ్రితుఁ దైవయోగ్యు నొ
క్కరుఁ గని "పుత్రు నీతిపరుఁ గా నొనరింపు" మటన్న నాతఁడు
ద్ధురమతి యొక్కనాఁ డతనితోఁ దగ మంతనమందు నిట్లనున్. 12

మ. కులవిధ్వంసకమైన కార్యము వివేకుల్ సేయఁగాఁ బోరుగా!
కులమన్నన్ గులమా! ద్విజాతి, యది చేకూరున్ వశంబే? తను
జ్జ్వలతన్ బ్రాగ్జనిభాగధేయమున సంపాదించి ప్రాయంపు దు
శ్చలముం బూని యధోగతిం బడు టిదే చందంబు? నీబోటికిన్. 13

ఉ. జన్నములన్ బొనర్చుటో! విశాలయశమ్ము గణించుటో! సదా
మన్ననకెక్కు పండితుల మన్పటో! చుట్టల నాదరించుటో!
విన్నఁదనమ్ము రాదె! సువివేకము పోదె? పురాకృతంపుభా
గ్యోన్నతి మన్నగాదె! యిటు లుంపుడుకత్తెలఁ గూడఁ బాడియే. 14

సీ. ముక్తికామినితోడ ముచ్చటించిరిగాని వెలవెలందులఁ గాంచి వలుకరైరి
ఉపనిషత్కాంతల నంచుకొనిరిగాని పడుపుతొత్తుల యానఁ బోవరైరి
సాహితీసతితోడ సరసమాడిరిగాని కులవిహీనలఁ జేరఁ దలఁపరైరి
కీర్తిభామినులకు మూర్తినిచ్చిరిగాని గుత్తలంజెలపొందు గోరరైరి;
తే. గీ. ఇరవెరమ్మఁ బ్రోడి యుండె నక మీకొ, లమ్మవారలు నేఁటి కీలలనకతనఁ
గొలము నకు నీవు నావరమ్మంకు నొక్క, పెట్టఁ జెడఁదగినంత యిక్కట్టువచ్చె. 15

తే. గీ. ఇహమునం దట్టులుండ మీయింటిపూర్వు, లహహా! పరమునఁ జేని వారాంగనాజ
నమ్మునకు సేవపడియె జన్మములు కోర్కె, యింతకయు లేక చేయుట యీవు వినవె?

ఉ. వైదికజాతిలోఁ బొడమి వారనికల్మికి నెల్లవై యని
ర్వేదమనమ్ముతో నిటు వివేకము దక్కి కళత్రయావన
శ్రీ దిగులొందఁ బాడువెలచేడియ నుంచెడి నిన్ను బోఁటికిన్
మాదిరి సేయ నీ భువనమండలి నొండొక డుండఁ బోలునే? 17

మ. తిరుగుంబోతులు లేరె? వారిఁ గనియున్ ధీజాడ్యమే లేనిచో
నరుఁ డెవ్వాఁ డిల వారకామినుల సౌందర్యమ్ము వాసించు? నీ
మరియా దెట్టిది? నేఁటి నీనడత కేమాన్యుఁడు లోఁగుందఁ? డో
ప్పరికింపందగునే? కనుంగొనుచు మీపాత్రపందు మా బోఁట్లకున్. 18

శా. దారిద్ర్యమ్ము జనించు, మై సిరి వృథా దైన్యమ్ముపాలౌ. సదా
చారం బాఁడియౌ, యశమ్ము మొదలే సన్న్యాసముం గాంచు, సం
సారం బగ్గిని ద్రగ్గు, నెల్లెడల నిస్సారత్వమే తోఁచు, నీ
వారస్త్రీ సురతప్రశంస దగునే? వర్ధిల్లు సంసారికిన్. 19

క. అని యేమేమో తా నే, ర్చిన విధమున బోధసేయఁ జెవినిడక యతం
డనయము నయంపుకావ, ర్తన మానఁడ, విటులమనను తరమే? త్రిప్పన్. 20

వ. ఇట్లు పలువురు సెప్పం దొడంగుటయు.

మ. ఇదిగాదంచు మనమ్మునం దలఁచి యయ్యేణాక్షితోఁ "గార్యమి
ట్టిది" యంచున్ దగఁ దెల్పి "మంచి" దనుడున్ డెందమ్ము వొంగార నొ
క్కదినం బాపురి వీడి యిర్వురును దుర్గాపట్టణం బేగుదెం
చి దిగుల్ దక్కి యటన్ వసించిరి ఘనశ్రీ మించు సౌధమ్మునన్. 21

ఉ. ఆపురి వీరిపూర్వులకు నాకరవాటను దండ్రి యచ్చొటన్
గాఁపుర మాచరింపఁ దగఁ గట్టెను సౌధము, దానిలోనఁ దా
నీపురుషోత్తముండు వెలయింతి నొకర్తుక నుంచెఁ బచ్చెఁగా
కాపురుషుండు నైపఁగలఁడా? యిది దాఁ గనలారఁ గాంచియున్. 22

ఉ. జ్ఞాతులుఁ దక్క బంధుగులుఁ గాంచి "యహో! యిది యేమివింత? దు
ర్నీతి సహింపఁగా వశమె? నేరుపుమై మఱలింత" యంచుఁ బో

నాతఁడు వారి వచ్చుటకె యాజ్ఞనొసంగఁడు లజ్జ పుట్టదు
న్నే? తగుబంధువర్గ “మిహిహీ!” యని యగ్రమునంద నవ్వినన్. 23

ఉ. నవ్వరు కొల్లవా రని మనమ్మునఁ దా నెఱుఁగండొ? యెక్కడా
అవ్వల నాకరంబగుట ప్రాజ్ఞతయం దగదం చెఱుంగఁడో?
యవ్వలఁగాక భార్యలను నంతయుమున్నె పరుండునై బుధుల్
ప్రవ్వఁ దిట్టు దుశ్చరిత రోయని యాయన నేమనన్ దగున్. 24

శా. ఆనీటున్ వెడకుంభోజుంగు భవనమ్ము దెల్లెడన్ గాయనీ
గానానూన రసమ్ములా! యభినయత్క్రాంతా వినోదమ్ములా!
నూనాస్త్రాగమ చర్చలా! మిగుల మెచ్చంగల్గఁగాఁ జేయు లా
స్యానుభవమ్ములా! యొలయు నీయావేళ నా కెవ్వడున్. 25

ఉ. తిట్టఁగనిమ్ము తల్లి, సుదతీమణి భోజన మేద్వనిమ్ము, బల్
అట్టు జనింపనిమ్ము, ధనరాసులు గవ్వలుగాక చెల్లని,
మ్మట్టి యఖండ సౌఖ్యముల నంయుచుఁ గష్టమెఱుంగనట్టి యా
పుట్టువుకన్న మిన్నయగు ముక్తి విరక్తి యొసంగ నేర్చునే? 26

శా. ఇచ్చున్ మద్దెలవిద్దె వారలకుఁ, దా నిచ్చున్ దగన్ బానుచోఁ
బొచ్చెంబింతయు లేనిస్నేహితులకున్ బూఁబోండ్లకో యిచ్చు రా
నిచ్చున్ బంక్తికి నెంతమంది నయినన్, వీక్షింపఁ డావంత యే
నిచ్చున్ “ఖర్చిది యాయమింత” యని, వాఁ డేమింకఁ గానుండెనో? 27

ఉ. తల్లికిఁ జిక్కు దిక్క మది దక్కు సమస్తము నాలుగేండ్లలో
డొల్లఁగఁజేసి యాపయిఁ గడున్ విలువై తగు నగ్రహారపుం
బల్లెలనిస్తు చాల కవి బంధకముంచి ఋణమ్ముఁ జేసి తాఁ
జెల్లఁగఁజేయుఁ బల్కలఁ జేతికి నెమ్మొక యింత యుండమిన్. 28

తే. గీ. తనపుపంక్తిని నన్నసత్రమ్ము జరుగఁ, గామసత్రమ్ము గణికలకడఁ జెలంగ
నయ్యవారునిఁ గొల్చుచు నెయ్యురెంద, ఱెందఱో సోమరులు వొల్తురెసక మెసఁగ. 29

ఉ. గాయక గాయనీమణు లొకానొక వేళను బాయకుండుటన్
జేయని చేరికై యతని చేతికి నాటవెలందివో లెఁ దా
హాయిగ జంత్రపుం గల యొయారపు మెఱుంగుఁ బొసంగి లొంగె నా
తీయఁదనంబు మెచ్చెనవీయక గాయనఁ డెట్టిఁదేవియున్. 30

తే. గీ. గాయకుఁడు వచ్చెనేని యక్కలికిఁ దాను, శిష్యభావమ్ము గైకొని చెలిమికలిమి
దానఁగలుగు విశేషముల్ తగినకొలఁది, నార్జనముచేసి కాని యయ్యనఘు విడదు 31

శా. దాతృత్వమ్మున మించియున్ మిగుల విద్యాసక్తి రాణించియున్
మాత్సర్యోపము దారదూరగతియున్ మాన్యేతరుంగా నప
ఖ్యాతుంగాఁ దనుఁ జేయ నాతఁ డది లోఁగాంచంగ లేకెప్డు లీ
లాతాత్పర్య పరీతుఁడై కడపుఁ గాలం బెల్ల హేలాగతిన్. 32

క. ఆకలికి వర్తనంబది, లోకుల కొకరీతినైన, లోనతనికిఁ ద
ద్వ్యాకులచిత్తుఁడగుట న్వాహా కలిగించి "యది భార్యయగు" ననిపించెన్. ౩౩

తే. గీ. "వీనితోనవ్వె మున్న నవ్వాఁతితోడ, నొక్కపేళయ్యుఁ గూర్చుండె నూరకుంట
తగవె?"యని యెవ్వరేనియుఁ దనకుఁ జెప్ప, వినఁడు వినెనేని నమ్మఁడవ్విధము సుంత.

తే. గీ. గాఁగ రాగట్టమాని యఖండనీతి, కాకరంబగు కులకాంత యట్ల నవ్వె
లంది వేషభాషాదుల నంది పైకి, సంచరించుఁ గులాచార సరణు లుడిగి. 34

మ. ధనమందిచ్చను గాదుగాని యల కాంతారత్న మప్డప్డు నా
థునిఁ జూడన్ గవిగాయకుల్ చనుడు నందున్ వచ్చువానిన్ దనం
తన యేవేళన్ వశ్యుఁ జేసికొని విత్తంబిచ్చు భర్తన్ జయిం
పనో కో నాగను జిత్తమిచ్చి కడు సంభావించు గూఢస్థితిన్. 36

ఉ. ఆచెలి కేమిపాపమొకొ హోయిఁగఁ బాడెడి వానికన్నునన్
వాచవిగాఁ గవిత్వ మొక వైఖరి సుంత రచించు వానిపైఁ
బూఁచు మనంబు, తాదృశుని పొందునకై మది నూఁచుచుండు నా
లోచన సేయుఁ దన్మయత లోలవిలోచన సారెసారెకున్. 37

తే. గీ. రాజు సంతసమందిన గ్రామమిచ్చుఁ, బద్దమిచ్చుఁ గవి బచ్చు దావైచు ముష్టి
యొవని మెచ్చునో కాంత యయ్యెమ్మెకాని, కనకపట్టాభిషేకమ్ము నాచరించు. 38

ఉ. ఈగతి నప్పుడప్డు ప్రియుఁ డెవ్వరి మన్ననసేయుచుండుఁ దా
నాగజయాన వారికె యాత్మగతిత్వము వెల్లడించు నా
శా గదియెల్లఁ గల్లరిగఁ బై వినువారలు నవ్వుచుండ్రిహో!
భోగము దాని నంచుకొనఁబోలునె? యెంతటి పందకేనియున్. 39

ఉ. పోయినఁ బోవుఁగాక వెలబోటిపయిన్ మనసూని యెన్నఁడే
నీ యది యంతగాఁ దనకు నెగ్గు ఘటింపదుగాని యొక్కతె
"శ్నా" యని యంచుకొన్న వెటినాయఁకన్నను హీనుఁ డున్నె? యే
జాయి సహింపనేర్చు నది ఆఁకు లొనర్చి యమర్చు సేవముల్. 40

మ. వ్యభిచారంబన వారకామినుల కావంతేని లజ్జాకరం
బభిమానఘ్నము నంచుఁ దోఁచ "దది గోప్యంబేల? గావింతు" ర
న్న! "ధృతిన్ దెచ్చియొసంగు నాథుఁ డదివిన్నన్ జీవనంబాఁడు" నం
చు భయానన్, గులకాంతరీతు లెటువచ్చున్? వాండ్రు నెట్టుంచినన్. 41

చ. సరసతగల్గువాఁడు గడుసంపద వొల్చెడివాఁడు నూతన
స్మరుఁడన నొప్పువాఁడు మదమత్తుఁడు నా విటుఁ డబ్బియున్ దరి
ద్రిరతికి నాస చేయునఁట తా వెలయా, లిది స్త్రీలజాతికే
పరిచితి గన్నదోస మొకబానిసలన్ వెలిఁజేయనేట్రికిన్. 42

మ. "ధనమేలా? సాఁసేల? చక్కనికవిత్వం బెవ్వఁడే నేర్చు వా
నిని మెచ్చన్ దగు, మాటలాడఁ దగు వానిన్ బిల్చి, యవ్వానినిన్
జనవీయన్ దగు, వానితోడ విధిగా సఖ్యంబు గూర్పన్ దగున్
వనితాచిత్తహరుండు వాఁ" డనుచు నవ్యాహూతి లోనెంచెడిన్. 43

ఉ. ఏఁకతనైన మేటి సుకవీంద్రునిఁ గొల్చి కవిత్వ మల్లు నా
యాఁగతిఁ జక్కనేర్చికొను నాస దినమ్ము వృద్ధిఁబొంద నా
భోగము చాన వూన్కి మెయిఁ బొత్తము లెల్లను జూచుచుండు నా
లోఁ గననయ్యె శాక్యకులలోలుఁ లోచనలన్ గవిత్వముల్. 44

తే. గీ. రాధికాసాంత్వనమ్మను రచనఁజేసి, పేరుగనుముద్దుపళని తెల్వియును విజయ
నగరభూపాలుఁ డుంచిన నాతిచాటు, పద్యములు గాంచి యాకీర్తి వశయనెంచి. 45

మ. ప్రియునిన్ గాంచి కవిత్వపుం గరిమయున్ వేళ్ళ నోశ్లాఘించి త
ద్దయు నావిద్దియుయందు నెమ్మనము శ్రీద్ధాబద్ధమై యుండుఁ జె
ప్పియు "వారిం బిలిపించి నాకు నది చెప్పింపన్ దలె" న్నాఁగ నా
దయితుం డాప్రియురాలి కిట్టులను విద్యావిత్త్వ మొప్పారఁగన్. 46

మ. కవనంబన్నను మాటలా? యదియుఁ జక్కన్ జెప్ప శాస్త్రాదికం
బవలోకింపవలెన్ బురాకృతపుఁ బుణ్యంబున్నపైఁగాని యా

ఉ. తప్పని యొప్పుకేని విదితంబొనరించిన నొప్పుకొంటయే
తప్పనదెందుకో యెఱుఁగు దార్ఢ్యము లేకొక ధార యూఁతగాఁ
జెప్పఁగ నొప్పునే? కవిత, చెప్పినచో నది మూసికట్టుచే
యొప్పదుగాని పై విడుచు టొప్పునె? లజ్జ గఁట్టివారికిన్. 55

చ. మనువు మహాకవీంద్రులు పయుజ్జ్వలభక్తి నొనర్చు కబ్బముల్
వినుతికి నెక్కఁగాని యవివేకుల కూఁతలు తాటియాకులం
దున నశియించె నొట్టఁబడు తుంపురులేనియు నిప్పుడచ్చుచ
చ్చినకతనన్ జగాన విలసిల్లెకి మేటికృతుల్ నశించెడిన్. 56

ఉ. ధార వృథారసమ్మనక ధారయిడన్ మనకెట్టులొప్పు నో
పీరికి, నెక్కడేనియు వివేకులు గల్గిన వారిఁ గొల్చి త
త్సారము గుర్తెఱింగి తగు శాస్త్రము నేనియు నభ్యసించి యా
పై రచియింపరాదొకో! ప్రబంధము, లేటికి వెఱ్ఱి యల్లికల్? 57

తే. గీ. కాలమహిమమ్ముగాని యేకాలమందు, వచనమురచించువారు కవనమునందుఁ
బేరుగాంచిరి, యెంతటిపేదతనము, వచ్చెఁ గవితాలతాంగి కివ్వారికతన. 58

క. అపశబ్దమ్ములతో వచ్చనపుఁగవితలు మొదలుపెట్టి నారాయణా! మూ
ర్ఖపుమనుజు లక్కటా! కవితపదమ్ములు విఱుగఁగొట్టెదరు నిర్దయులై
గీ. సంస్కృతాంధ్రమ్ములందు వచనకవనము, మున్నురచియించువారలు నున్నవార
నర్ఘమగుపాండితీయుతు బహ్వకవనమ్ము, గలిగి విద్యావిదులమెప్పుగాంచువారు. 60

తే. గీ. పా లనుభవించువారు యవాగుపోక్క, యుపుడు దాఁగిన చిత్తులంచనరు వారి
సరికదా! వారి కవియు యశము ఘటించు, లేమి నది దాఁపువారి కాలీలమెట్లు?

చ. ఇవు డిఁకనొక్కకర్మ మది యేమన? నేర్చినయంతలోనఁ గ
బ్బపుఁబనులాచరింప నది పండితులొగ్గవులొప్పఁజూచి "యీ
కవితము సెప్పనేల!" యని గాఢముగాఁ దల వాయఁ గొట్టి దా
నిపయి విమర్శనం బొకఁడు సింపుదు రంతకు నుమ్మడుంగుగన్. 52

తే. గీ. కుడిచికూర్చుండి యొక్కచో నడఁగియుండ, లేక నీకేల యీవెఱ్ఱి లేమ! యంత
వలసెనేనియు గానమందలి పరిశ్రమ, మమ్మ హెచ్చించిది యటంచుఁ బేరుఁగొమ్మ! కొమ్మ.

చ. అన నది యిట్టులపల్కు "నిజమాడితి రైనను గానవిద్యలోఁ
బని యధిరోహంతచేసినను బాడెడి శిక్షయె తక్క నర్ఘమున్

గనెడి తెలుం గొకింతయును గల్గదు దాని విధమ్ము లేనిచో
జననము వ్యర్థ మయ్యది పొసంగెడి విద్యయె విద్య యెమ్మెయిన్. 64

తే. గీ. అన్ని విద్యలఁ గలుగు సారాంశములును, గవితలో నలరారెడిఁ గానవచ్చుఁ
గాక రాకుండుఁ గాక యక్కలకు యత్న, మనుబొనర్చెదఁ బ్రాప్తమెట్లనువుపడునొ

క. పదకవిత మొదల నేర్చితి, నది సామది కతకష్ట మనిపింపవ యే
రొదవింపలేరు వచనము, గదియింపఁగ నెంతుఁ బద్యకవన మ్మింకన్. 66

క. "ముదివిటులు విధవలంజలు, పదకవిత" లటంచుఁ దిట్టె బహుశాస్త్ర వచో
భ్యుదయుఁడు శ్రీనాథుం డకి, చదివితి నాపైఁ గోర్కె చదికిలఁబడియెన్.

తే. గీ. కడుపు చెక్కలుగా నవ్వఁగలుగు నకట!, వేణుగోపాలశతకమ్ము వింటిరొకొ ?
"ద్విపద కావ్యమ్ము ముదిలంజె దిడ్డిగంత" యనుచుఁబడఁదిట్టె నతని నేయమ్మగనెనొ.

ఉ. కావున మీర లొక్క కవికంజభవున్ బిలిపించి యాయనన్
జీవనవేతనాదుల వశీకృతుఁగా నొనరించి నన్ను వి
ద్యావతిగా నొనర్చు టది తప్పదు మాకులమందు ముందు వి
ద్యావతు లాంధ్రపుం గవిత లల్లు యశస్విను లుండెఱుంగరే. 69

చ. అన మనమ్మది దానిదగు నాస్థకు సంతసమంది "మంచిదే"
యని కడు బుజ్జగించి తగుట్టి కవీంద్రుని రాఁక గోరుచున్
దినములు పుచ్చుచుండ సుదతీమణి యొక్కెడఁ గోరె నాతనిన్
దనపురిఁ దత్సమేతముగఁ దాఁ జనఁగా నతఁడొప్పె నందుకున్. 70

వ. పదపడి యప్పాణిగృహీతతో సపరివారమ్ముగ భాగధేయపురమ్ముచని యయ్యెడ నొ
క్క చక్కని బాడుగుమాడుగున వసియించి నిరంతర సుఖమ్ముల నోలలాడుచు సం
గీతాది వినోదమ్ములఁ దేలు నవసరమ్మున. 71

చ. కన్నడసీమనుండి యొక గర్భదరిద్రుఁడు సుంత కైత వాఁ
బన్నఁగ నేర్చువాఁడు నొకపాటిగ గాన మెఱుంగువాఁడు రూ
పోన్నతి లేనివాఁడు వయసొప్పెడి వాఁ డొక బ్రాహ్మణుండు వ
చ్చె న్నిజశక్తిఁ జూపి సిరిఁజెంద సుదారుని జూచు వేడుకన్. 76

మ. పదపద్యమ్ములు కొన్ని చెప్పి తనదౌ ప్రావీణ్యముం జూప "నే
మిది! నీవున్ గవనమ్ము చెప్పగలవా? యెందెందుఁ బాండిత్య మూ

న్న దికి?" యంచుఁ జిత్రపాండితీగరిమ నారాయణావిశేషమ్ములన్
గదలింపన్ వెలఁగంది యక్కవి రిక్తత్వమ్ము సూచించుచున్. 73

ఉ. స్కూలున నింగిలీషు నొక కొంత పఠించితిఁ దెల్గు దానితో
లీలగ నభ్యసించితిని లేమిమెయిన్ బయిరెండు సాగమిన్
జాల విచారమంది వెస ఛంద మొకించుక చూచి గానపుం
జా లది పూర్వమే కలిగి సాయ మొనర్పఁ గతల్ రచించితిన్. 74

చ. హరికథ లల్లుచున్ గృహము నందలి రిక్తత వాపికొంచు నేఁ
దిరిగద దేశముల్, తగు సుధీమణి శిక్ష యొకింత లేమి సు
స్థిరగతి గాఁ గవిత్వ మది చెప్పఁగఁజాలఁ గటాక్షమూఁచి మ
త్పరిచితమైన యట్టి కతఁ బాడఁగ నాజ్ఞ యొసంగ వేఁడెదన్. 75

చ. అన జలజాక్షిఁ గాంచి "చెలియా! కనఁగొంటివె యాతనిన్? కుటుం
బనియతికై ధనాఢ్యులను వంచన సేయఁ గవిత్వమంచు నై
కొని వెటిమెట్టి పద్దెములు కొన్ని రచింపఁగఁ జొచ్చె నేను జె
ప్పిన యది యెల్ల సత్య మనిపించుట కీతని రాఁక యుగ్మలీ! 76

తే. గీ. ఎందులోఁ జేరకుండెడి హీనులెల్లఁ, గవులలోపల నిర్భయుఁ గలియుచుండ్రి
ఎల్ల వర్ణమ్ములును గూడి యుంచుకంత, యంతరము లేక తురకలయందుఁ గలియు.

ఆ. వె. ఇంగిలీషు చదివి యీకవిత్వము సెప్ప, నేల? దానఁ జెప్ప నేల? రాదు
ఉభయభ్రష్టు లిట్టు లొనరింతు రీనాఁటఁ, గవుల కింక నేటి గౌరవంబు? 77

చ. అన సదయాంతరంగయయి యచ్చెలి పల్కు విశేష పాండితిన్
గను కవిచంద్రు లిక్కరణిఁ గాఁ జనుదెంతురె? యెల్లచోట్ల కి
య్యనఘుని వాక్యమాధురి సహస్రము సేయఁగఁ జాలు మీరు వ
చ్చిన కవి కాకపోయినను జెప్పఁగ నేర్చుఁ గవిత్వ మొప్పఁగన్. 78

చ. చదివెడి శైలి గానపుఁ బసం దలరారఁగఁ జేసి చక్కఁగా
మదికి ముదం బొసంగఁదగు మంజులమైన పదమ్ము లుంటచేఁ
బొదలు రసంబు, నేరుపును బొల్చెడిఁ దప్పులకేమి? రక్తిసం
పద నడఁగింప నేర్చునె? చమత్కృతిమత్కృతియందు దోసముల్. 79

తే. గీ. దోషముల్ గల్గఁ గాక నిర్దోష మయ్యు, గాక రసహీనకృతికన్న ఘనరసాస్ప
దంబగు కవిత్వమెంతొ ముదం బొసంగు, నంకయంతుఁ డయ్యు జాబిల్లి హాయినిచ్చు.

శా. ఆమాటల్ విని యయ్యుదారుఁడును దా నంగీకృతిం బూని న
ర్మామాత్యాదులలోనఁ జేర్చికొని యాయావేళఁ బాడింప చే
మేమో యల్లిక లల్లఁజేయుచును నారాయణాక్షియుం దాను ని
త్యామోదమ్మునఁ గాలముం గడపుచున్నంతన్ దుదిన్ వానికిన్. 82

చ. ఎరు సాకయింత లేక చరియించుచుచే నలకాంతపై మనం
బరిగి యదెంత ద్రిప్పినను నట్టిటు తాఁ జలియింపదయ్యె న
త్తరుణికి నంతమున్ మనుపెఁ దన్మయమయ్యె మనోవికార, మా
యిరువుర లోపమేమి? యట నీతనిదే యపరాధ మెమ్మెయిన్. 83

శా. దానిన్ భార్యగ నెంచుకొన్న యతఁ డంతస్థాపితన్ జేయక
వ్వానిన్ వీనిని గోప్యమం చెఱుఁగక వ్యామాక్షి కేళీగృహం
బేసిన్ జేర్చునె? యిట్టులైన నదిగాదే? సత్సతీరత్నమున్
మానం బూడ్వదె? నిత్యసంగ మది యున్మాదంబు గల్పింపదే? 84

ఉ. "స్త్రీలకు గోప్యతాగరిమ చెప్పెడివారలు వెఱ్ఱు" లంచు మూ
ర్ఖాళి వచింతు రిప్పుడిటు లంగనలన్ సభ కెక్క నిచ్చి యా
మూలమునన్ జెడన్ మొగము మాసుక మిన్నక లోనఁ గుందు జ్ఞా
నాలసు లెందఱో యిల స్వయంరచితాగసు లుండి రక్కటా. 85

క. మన పూర్వులె తమనుభవ, మనఁ జేసిరొ? కట్టుఁబాటు మూర్ఖులు దానిన్
గననేరక యిహీహీ! యనఁ, జనునే? తమకంతకన్న శక్తులు కలవే? 86

మ. కలుదారిన్ జన దంచుఁ జెప్పుటకునై కల్పించు నాచెట్టునా
కలుగూడన్ గలవమ్మ లంచుఁ దమవాక్కుల్ శాస్త్రముల్ గా జగం
బులకున్ బోధ యొనర్చినట్టిసుమహాత్ముల్ కద్దు కైలాసమా
ఖులకున్ బోలఁగఁ జాలరో? వశమె యొక్కో ఖండిప నక్కట్టులన్. 87

తే. గీ. తమరు విధిలేక చేసెడి తప్పులన్ని, కడుపున కటం చెఱుంగరే ఘనులు, వాని
నొప్పులని చెప్పనొప్పుట యొక్కతప్పు, పూర్వులను దూఱుటది యొండు దప్పుపయితప్పు.

తే. గీ. స్త్రీకి స్వాతంత్ర్యముండుట చెల్లదంచుఁ, జెప్పమను వంతవెత్తిరే! చెడికొలమ్ము
నెల్ల గంగను గల్పదే? యెఱుఁగనేర, కూరకయ శాస్త్రకర్తల మీఱనగునె? 89

ఉ. బోగమదాని కింత తలపోయఁగనేటికిఁ? గుక్క గోవునం
గాఁగ నొనర్ప శక్యమె? యగాధము రేగతి నంచెనేనియున్

స్త్రీగతు, లందులోఁ గఱకు చేయనివాఁడు ధవుండు గల్గఁ డా
యోగిని వంట్రిదైనఁ గను నొక్క క్షణమ్మున భోగినీగతిన్. 90

ఉ. ఆగతి నిర్వరున్ మరుని కగ్గలమై మనమంద మగ్గుచున్
సాగమిఁ బొక్కు "చింపుకయు సందగునే?" యని దేవు వేఁడుచున్
రాగమె రోగమై తగఁ గరమ్ము నలందుచుచుండి రంతలో
నాగజమాన సాహసము నంది కృతార్థునిఁ జేసె నాతనిన్ 91

క. సామాన్యయయ్యుఁ బరకీయామాన్యతఁ గాంచి వాని నహహో నిశయో
యేమూలనో చరితార్థ్యం, గా మన్నన సేయు నతని కనుఁబ్రామి యొగిన్. 92

ఉ. నాయక పక్కలో నిమిడి నాతి యెటుల్ కనిపెట్టునో యతం
డాయతమైన నిద్రగను నయ్యెడ మెల్లనలేచి "రాదుగా?
ప్రేయసి" యంచు లో నొగులు ప్రేముడి కాని యియ్యమ్ము చేరు నా
మాయలమారి, యత్యుతివ మానస మేమిటు ధాత చేసెనో? 93

ఉ. రూపవిహీనుఁ డొక్కటుఁడు రూపసి, చీఁకటి వెల్గు, స్థండిలం
బే పటు, పూరకు డుటయె యింపగు పల్కులు, ధూళి గంద, మే
చాపయు నేని దుప్పటిగఁ జాన కృతార్థతఁ జెందు సేవకుల్
దోఁప వోకిఁచు కేనియును దొయ్యలికిన్ బ్రియుఁ డబ్బుపట్టుఁగన్. 94

మ. తనకై భార్యఁ బరిత్యజించెనఁట మాతన్ వీడి యవ్వాసమై
నను గాదంచును రోసెనంట యొకఁడై జ్ఞాత్యాదిబంధువ్రజం
బునకున్ దూరగుఁడై వెలింబడిన చొప్పున్ గాంచె నం టట్టివా
నిని దా నిట్టులొనర్ప న్యాయమగునే? నీచాత్మ కాకుండినన్. 95

ఉ. ఆతనియందుఁ బ్రేమ మొదలంట నశించియొ? కాదు; లేక దు
ర్వ్యాతిగమైన చిత్తమున నాశ జనించియొ? కాను; యాపసం
ప్రీతియొ? కాదు; కొండొక కవిత్వ మదింతకుఁ దార్చనొక్కొ? దు
ర్జాతికిఁ గల్గు చంద మనరాదె? వికల్పము లిన్ని యేటికిన్. 96

మ. మగనిన్ రూపమునన్ ధనమ్మునను సమ్యక్ఖ్యాతిరేకమ్మునన్
దగు విద్వత్తను దక్కుభంగులను మందప్రజ్ఞుఁ గాఁ జేయు మేల్
సుగుణుల్ లేకయె యొక్కరీతి మెయి నించున్ మించు గావండ మే
టిగుటిన్ గొల్చెనె? సాధ్వి, మానవతు లీతీవుల్ ప్రశంసింతురే? 97

ఉ. "పోఁడిగు వీఁడు గాదునికి వేఱొకఁ డా" నను నట్టి బుద్ధిఁ దూఁ
గాడెడి యందకత్తెఁ గొని యంతటఁ బోవక పంజరంబునన్
గ్రిడఁ గాక మంచుగతి గేహమునం దిడ గేహినీగతుల్
పాడుకొలమ్ము కొమ్మలకుఁ బట్టునె! పైపయి నవ్వి యున్న వే? 98

మ. తనకున్ బ్రొద్దుట లేచుటాదిగ నిశీథంబైన యందాఁక న
మ్మను బిన్నమ్మలఁ బెద్దయమ్మలను బై మాతృష్వస్రస్తోమమున్
దనతోఁబుట్టువులన్ మరల్ గొలిపి విత్తమ్మిచ్చి భోగించు దు
ర్జనులన్ బుట్టినదాది చూచు చెలికిన్ సాధ్వీత్వ మెట్లబ్బునో? 99

ఉ. ఉంచికొనంగ నేల! వెల యూడిగపుం జెలులన్ జనుల్ నయో
దంచితమైన వర్తనముఁ దార్పఁగ నేల? పయిన్ దదన్యథా
భ్యంచనలైన వాగలకు నల్గఁగ నేల! కటా! భుజంగులన్
వంచనఁ జేసె ధాత, యొకపాటివివేకము గల్గఁజేయమిన్. 100

ఉ. ఆచెలి వానిఁ గూడి యిటు లాడుడిపోకలు వోవుమన్ బ్రియా
గోచరమైన పక్కి నటు కొన్ని దినమ్ములు వుచ్చె నంత నా
యీ చతురత్వమెల్లఁ దరి నెయ్యెడలన్ వసియించు నెయ్యురే
చూచి క్రియమ్ముగా "నిజము సు" మ్మిది యంచుఁ దలంచి యొండొరుల్. 101

చ. కలసి యొకానొకప్డు "ఇది గా దది యౌ" నని చర్చఁ జేసి "యీ
తులువ కిదేమి మూఁడెనొకొ? తోఁచదు శుద్ధపరిమ్కిఁ డిక్కుశల్
తెలిసినఁ గోపదారి వెనుదీయునె? చంపుట కాతఁ డక్కటా!
కలిగెనొకో! దురాత్మునకుఁ గాలము డగ్గఱె యిట్టి దుర్మతుల్. 102

ఉ. విప్రులలో జనించియును వీరుఁ డితండు దురాపులన్ గటా
గ్లప్రతిమానముల్ గృహమునం దెపుడున్ గనుమాయసేయఁ డా
రిప్రదమంచు నెంచక పొరిన్ బొరి వేఁటకు నేగి కాన జం
తుప్రకరమ్ముఁ జంపుమన దుండగుఁ డిప్పుడున్ సహించునే! 103

చ. అనవుడు వేఱొకం డను "నహా! యతఁ డేమి యొనర్చు నట్టి చ
క్కనివిటుఁ దబ్బి సర్వవిధకామములన్ దన కున్న యప్పు డే
మని యిది గోరఁగావలయు నా యథమున్? వరియించినప్డు కా
ధని వెనఁ ద్రోయువారు గలరా! యిది యాతని దోసమెట్లగున్? 104

తే. గీ. అక్కలికి భాగ్యరేఖ దానట్టిదగుటు, వెలికి రాకుండెఁ గాని యీ వెఱ్ఱితనపుఁ
బోఁడ యిటువంటి యతిథులఁ గూడ దింతఁ గొంద ఱెందఱి నిదియనకేటికొఱ్ఱ?

చ. ఇది బహుతెక్కులే నిజమగేనియు నాతనిఁ జంపనేల? య
మ్మదిక కధింపు టొప్పగుచు, మూర్ఖుఁడు గానియెడన్ వివేకసం
పదకలిమిన్ జెలిన్ గృహము పాడుఁగఁజేయుటె మేటి తెల్వి, యు
క్క దినకమానునే? తనదు గ్రాసము లేకుఖ మిచ్చి పెంచినన్. 106

చ. అనుకొన రాదుగాని మన మీతని దిక్కయుఁ దిచ్చునుండి, యే
మని వరియించె నంతకె సహస్రము చూచినయివ్వెలంది? నే
మని నతి వీడి యీతులఁవ కబ్బురపుం జనవిచ్చె? వీని ని
వ్వానిత యదెట్లు చేసినను వహ్వరె! మెచ్చఁగవచ్చు నెమ్మెయిన్. 107

సీ. తను దత్తుఁ గాఁ గయికొనినతల్లి "హులోపాలో" యటంచును దుఃఖమొందుచుండ
తనకుఁ గన్నియ నిచ్చు ననఘులౌ నత్తమామలు లోన మలమల మఱుఁగుచుండ
తనుఁ గట్టికొన్న యుత్తమురాలు భార్య సంతతధారావృష్టి నేత్రములఁ గురియ
తనయపక్షపు టాసఁ దలక్రిందుగా వ్రేలు పితరులెల్ల నిరాశఁ బెట్టు దిట్ట

తే. గీ. నెందుకీ మదితొత్తుతో నిటకు నటుకు, గాలిఁ దిరుగాడునొక యూఁగాక పారెఁ
బయనములోనఁ దప్పమను దనవైరాగ్య గుణము తెలుపఁగనీ వీనిఁ జేర్చుకొనఁగవలయు?

ఉ. మాటువులెన్ని? పూవులును మాళ్లును నందరు తోఁటలెన్ని? పై
నీడువచింపరాఁ దగని వెన్ని సిరుల్? తన కేమివచ్చె న
వ్వీడు విడన్? విడెన్ సరియె వెక్కటి యాత్మపురమ్ము జేయుటన్
బూడిద! యెట్టికిప్పురినిఁ బోవలె వర్తన వద్ద కొంపలన్. 109

శా. ఆప్పాల్ సేయుటుతప్ప వే ఱెఱుఁగఁ డీ యార్యోత్తరుం డెల్లరన్
బప్పు గూడఁగ మిగ్రిగుచుండి రిపు డిప్పాపాత్ముఁ డాలెట్టులేన్
దప్పుం గాక యదృష్టమే యిదియు నీకుం డిందలోనైనఁ దా
విప్పు న్నేత్రము, లున్నమట్టునయినన్ వీక్షించి రక్షించెడిన్. 110

చ. అన నతిరయోఃకుఁడిట్లును "నాతని కెవ్వ ఱెఱుఁగఁ జెప్ప వా
రివ్వఁ డెవరెన్ని చెప్పినను వీడెఁడి, యంతటఁ బోక చెప్ప వా
నిని వెలిఁజేయు నన్యుతిన నేరుప దెట్టిదొ? యింత పెంకివా
నినిఁ దన ధామఁ జేసికొని నిక్కడి నీగ్గెడి వెట్టిపీఁగడిన్. 111

ఉ. ఎవ్వని నేని లెక్కయిడ దెంతటి వానికి నేని మ్రొక్క దీ
క్రొవ్వునఁ బల్కవలెన్ మనసు గోరిక దీఱఁగ నందు నెంతు నేఁ
డివ్విగఁ జేయ నెఱ్ఱ దగినదే యిది యైన మ హేమి లాఘవా?
నవ్వఁగఁ బంబోజుం గిది యథార్థ మటంచుఁ దలంపఁ డింతయున్. 112

చ. అన మఱియొక్కఁ డిట్టులను "నా చెలి కోలికిఁ బోవ నేల? యా
యనఘుఁడు దానికిన్ గలసె నాకిఁకఁ దప్పు లొనర్పఁగాక యా
తని కవి యొప్పు లేయగు వృథా మనకేటికిఁ గంఠశోష! యే
మని "తగువార" మంచు నిది మాతనితోఁ గదియింప నేర్చుటో!. 113

క. అదివేశ్య, యితఁడు విటుఁడి, ట్ట్యాది తప్పెట్టులగు? భార్యలైనవనితలే
వదలంగనేర రీదు, ర్మద పుంజైనములు, నేరులమా నేమిటికిన్. 114

క. మన మేల నిమిత్తస్వము, గనవలయున్ దీనిఁ బాపగతి దాఁ గదు వైఁ
జనుఁ దనయంతన యది యా, య్యనువునఁ దోప్పడఁగ రాదె? యంచనలసిరన్.

క. "ఏకఱ్ఱు నిప్పుడిన, నాకఱ్ఱుకు కాలు" నన్న మనవసరం బీ
పోకలు తగు యోగ్యులకున్, వాకొన్వఁగ రాని, వింత వంతేమిటికిన్.

క. అని మిన్నకుండి రంతటఁ, జని మొన్ మఱి కొన్ని నాళ్ళు, చయ్యన నక్క
మినికి వినాశన కాల, మ్మగు మూఁడెన్ తెలిచో సుబుద్ధి వోడమదే?

వ. ఇట్లు దినదినమ్మును గోరిక లీరికలెత్త నత్తలోదరి చిత్తమ్మున నుత్తలపాటు దక్క
యక్కకవి యక్కవకక్కఱను మక్కువఁ దక్కుచు సొక్కుచు నున్నంత నొక్క
నాఁటి రేయి యథాపూర్వమ్ముగ గానాదిసవినోదమ్ములఁ గాలహరణం బొనరించి
నిశీథ మ్మగుటయు. 118

చ. తన దయితుండుఁ దాను మఱిఁ దక్కిన నెయ్యురఁ గొత్రి త్తభత్తయున్.
బెడగది సందునం దిమిడి వేఱుగ శయ్యలఁ బవ్వళించి యాం
డినపు డెమ్మెకానిపయి డొంకము వాఱుచు సాహసించి "యీ
జను లెవరేఁ గందు" రని చాన మదిన్ దలపోయు చొప్పుగన్. 119

శా. అందెల్ చప్పుడు సేయకుండుగతి నొయ్యారమ్ముగా లేచి దీ
ప్తిం దెల్పొందెడి దీపమార్పి గుఱిచేఁ జేరి యాస్వదుం జూచి "వ
చ్చెం దన్వంగి" యటంచు మేల్కనిన యా చోరపిత్రయున్ జేరి దూ
నందింపన్ దొడఁగెన్ దధీయ మగుడెంపం బొత పాషాణమో 120

ఉ. ఆలలితాంగి దాఁ గని యుదారుని స్యాలకుఁ డెంతయేనియుఁ జ్
బాలకుఁ డయ్యు లోనఁ "దన బావకు నప్పకు దూర మౌటకుఁ జ్
మూల మిదే" యటంచు దలపోసి "యి దేఁ త్రినైఁ బోయినన్
మేలగు నప్ప" కంచు మితి మీఱిన తోషముఁ దోషముఁ దగన్. 121

ఉ. అల్లన లేచి దీపము గృహమ్మున వెల్గఁగఁ జేయునంత నా
పల్లవపాణి మున్నె తనదౌ శయనీయముఁ జేరి "యింక నే
కల్ల వచించినన్ వణఁకు గాదిది వీనికి స్పష్టమాయె వీఁ
డల్లరిసేయుఁ" నంచు మది నల్లలనాడి దిటమ్ము గాంచియుఁన్. 122

వ. ఉపాయమ్మునసప్పిల్లవానిఁ బిలిచి మంతన మ్మగునెడకుం దీసికొనిపోయి వెలవెలం
బోవుచు దీనమ్మగు చందమ్మున మెల్లన నిట్లను. 123

ఉ. తమ్ముఁడ! నన్ను నప్పగ నెదం దలపోయుదు వేని నట్టి చం
దమ్మున నిన్నుఁ జూతు నొక తప్పొనరించితి నెట్లు గడ్పలోఁ
బమ్మిన పేర్మిఁ బెట్టికొని బావ యశ మ్మికఁ రతుచేసెదో
నమ్మవలెన్ స్వబుద్ధికృత కార్యము గా దిది మోస మయ్యెఁజూ!. 124

ఉ. ఈవిధి దాఁప నేమిగల? దేనొక నిద్దుర వోయి లేచి మీ
బావయటంచుఁ దగ్గఱిఁ బాపి యతం డెటు లూహ చేసెనో
భావజు మర్మకర్మముల పాలొనరింపఁగఁ జొచ్చె నింతకున్
జీవము నీదహస్తమున జిక్కెఁ గృతాగసురాల నెమ్మెయిన్. 125

ఉ పాపపు నిద్రవత్తు పొరఁబా టొనరించెను గాక లేనిచో
"రూపసి" యంచు వానిపయి రోసు జనించి స్వయంవరమ్ము గా
నాపగిదిన్ బయిన్ బడితి నా? యిపు డేమన నేమి లాభ మా?
దీపము కొంప దీసె. దన తేజము నంతకె పాయునేట్రికిన్. 126

మ. అది గాకన్ని విధాలఁ జెప్పిన ననీ యామూఁక దానెందు కీ
గదిలోఁ జేర్పవలెన్? వినందు కద! యీకర్మమ్ము నేఁడబ్బె నాఁ
డుది యంచున్ మగవాఁ డటంచు నొకకట్టుబాటు లేకున్న ని
గ్గది దక్కం గలదే? యిఁ కేమనుచు నేఁ బ్రాణమ్ముతో నుందునన్. 127

చ. అరమరలేమి సిగ్గుఁ డి యంతయుఁ దెల్పెద నాఁతలోన నే
నరసితిఁ గొన్ని సంగతుల "నాయన కా" రని, యిప్పుడేని దు

శ్చరితుఁడు పోవనిమ్మనిన సమ్మతి చెందఁగ వచ్చునా? "యిదే
దొరకెను సం" దటన్న గతి దుండగుఁ డయ్యె నిఁకేమి సేయుదున్? 128

చ. ఎవరిని బట్టినన్ విడువ రేను వచించితి నేనిఁ గోపమున్
దవులు నొకప్డు చూచితివె? "ధర్మమె! భార్యను వీడు" టంచు నే
మివిలి వచించుచున్ గనిన మిక్కుటపున్ మారియాద, వేఱ చె
ప్పవలయు నే? యెఱుంగనివి బావగుణమ్ములు నీకు నున్నవే? 129

ఉ. ఎన్ని విధాలఁ జెప్పినను నించుకయున్ విన రేమి సేతు? నా
మె న్ననుజాముకన్నఁ గడు మేటిగఁ జూడకయున్న దుర్యశో
భ్యున్నతి మిమ్ముఁ బొందు టటులుండెఁగ నెల్లను నంతకన్న ను
న్న న్ననువార లన్న "నిను నాలుక గోసెద" నంచుఁ బైఁ బడున్. 130

ఉ. దగ్గఱినఁడు నీ పలుఁగు దారిగుఁడుఁ బోతు లదేమి చెప్పిరో!
యగ్గిని దోసమబ్బినను నబ్బెనిఁ గాక వచింపఁ జెల్లునే?
మగ్గి గృహమ్ములో నిముడుమానవతీతిలకం బుపట్లు నే
రొగ్గును, నెంతకుం దగరె! హీనులఁ గొంపలు గూల్చు కూళలన్. 131

చ. నిజమగు దోసమున్ గనియు నిందగృహస్థులు వృద్ధికాము లా
ర్యజనులు చూడకున్న యటు లక్కడనే వఱతుర్ దురాత్ములో!
ప్రజలకు గీడు సేయుటయు వర్తనమాట నసత్యమేని దా
ని జగతి కెక్కఁజేయుదురు నీచులఁ జేర్చికొనంగఁ జెల్లునే? 132

ఉ. పుట్టెఁడుఁ పేర్మితోఁ బతి! భోరున నాయమ యేడ్వ దారమున్
గట్టిన యాపెకన్న నను గాదనరాదె! యెటుల్ వచించినన్
బట్టినపట్టు వీడ రని బావ నెఱుంగుదు గాదె? యింతకున్
గట్టిఁడిదైవ మామె నటు గాటియువెట్టెడి నేమి సేయుదున్. 133

ఉ. ఆయమ మేటిదై గృహమునందు సమస్తము చక్కఁబెట్ట నే
పోయిగ నాపెచాటున విహారపు భార్యగ నుండి యిర్వురన్
బాయక కొల్వఁగాఁ దలఁతు బానిసతొత్తులు భార్య లౌదురే?
"వేయికి నుండు నే" యనుచు వీరపతివ్రత దాన నే మగున్. 134

చ. పతిరత యుండదేనియును వారకధూమణి, దాని కెట్టులో
ప్రతిన చెసన్ గుటుంబినికి రా వటు దుస్థితు "లేమి" యంటివా?

సతి గల యింటికి కిక్కురణి సంఘముచేరదు చేరనేని యు
న్నతగుణు లందు రం దవగుణమ్ముల కుప్పలు నుప్పనర్పరే! 185

చ. తనుఁ బతియన్న భ్రాంతిమెయి దగ్గఱఁ జేరిన దుర్జనుండు గా
టునికిఁ బయిఁ బడఁగాఁ డె? యోగ్యుఁడు కొండొకనాతి యెట్టిదై
నను దనతల్లిగాఁ గనఁడె? న్యాయము దుర్మతి కేలతోఁచు? వె
వ్వాని ననఁగేల? నాదు తలవ్రాఁతకు దుఃఖము నందఁగావలెన్. 186

చ. అని తనదైన తెల్వి యది యంతయు నట్టిపడన్ బతివ్రతాం
గనయును బోలె సీతుఁను గాపనసేయుచు నప్పగారిపై
ననుమతి చూపు టాదిగల యాశిథ మంత్రయుఁ జూచి వాని నె
మ్మనము గరంగి నీరయి సమంజసమై కృప దాని కిట్లనన్. 187

ఆ. వె. ఇంత చెప్పనేల? యే నెటికా యన, తోడఁ జెప్పవాఁడ? ముదుకు చెంద
కలదు, తెల్లవాఱ వచ్చె నిద్రింత ము, పోవ మదిగొ చుక్క పొడిచె ననుచు. 188

తే. గీ. చేతిలోఁ జేయి వేయించి చెలియుఁగొంత, యంతరంగమ్ము విశ్వాసముఁ దఁబోయి
యల్లఁ గనుమూసి నిద్రించునదియపోలె, నభినయించుచునుండె నయ్యవసరమున. 189

సీ. వాఁడును "దీన వేమగునొ? వామవిలోచన" కంచు లోన న
త్తాఱుచు "దాఁటుకోఁ గలిగి నంతట్టిదే చెలి" యంచు మెచ్చుచున్
"గూడిక కంతరాయ మొనఁగూడునొకో" యని చింత నొందుచున్
వేడుకదక్క "యెప్పుడిఁక వేఁగునొకో!" యని యెంచుచుండఁగన్. 140

క. కాకమ్ము లఱచె మన్నో, "కోకో" యని కోళ్ళు గూసెఁ గోకమ్ములు ను
త్సేకలిమి విఱ్ఱవీఁగె ది, వాకరుఁ డుదయించెఁ దెల్వి కఱలె జగమ్ముల్. 141

గద్య.

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం

బైన పాణిగృహీతయందుఁ

బంచమాశ్వాసము.



# పాణిగృహీత.

## షష్ఠాశ్వాసము.



అకపటహృదయాంతర్ని
త్యకలితనాదస్వరూప దాతృశ్వత్రీ
ప్రకటితయశస్కా బాభా,
సకలాజాలాభిరామ సీతారామా.

తే. గీ. అవధరింపు మనంతరం బయ్యుదారుఁ, డించుకేని యెఱుంగమి నెప్పటట్ల
నత్తలోదరితో మాటలాడఁడుగాని, యబల యొక్కింత మది సందియమునఁ జలుకు. 2

మ. తనమర్మంబది గుఱ్ఱెఱుంగు ననుచున్ దన్వంగి యబ్బాలునిన్
గన మాటాడఁ, దదగ్రిమందు మసలంగా సందియం బందు నా
తనుఁడా ప్రేముడి కానిమోము గని తంద్రిన్ జెందు వేయేల? జీ
వనమే బర్వఁగ నెంచు మించినత్రపాభారమ్ము ఁ బ్లొఁగదా. 3

వ. అట్టియెడ నుదారుం డచ్చెలిమిన్న చిన్నవోయినవిధమ్మున నున్న తెఱంగునఁ దన
కన్నులు బన్నమ్ము గన్న యట్లు చింతించుచు సంతాప మ్మగ్గలమ్మగ డగ్గఱఁ జేరి
బుజ్జగించి యిట్లను. 4

క. తెలవాటిన మొద లెప్పాను, కలికిరో! గానమ్ము లేక కవితయు కృషిలో
మెలపుడఁ గలకలలాడెడి, తలఁ పేమిట్టి కిటినముసఁ దాకగ చెడియెన్? 5

మ. కవి యేమయ్యెను? గైత యెం దడఁగె? జోకలౌ మాటె నీ మిత్రలోఁ
జవి నానాఁటికి హెచ్చెనో? యుడిగెనో? చంద్రాస్య? పద్యమ్ము లె
ఱ్ఱ్యావియేనిన్ రచియించితే! చదువు మేదీ? చూత మం దెందు నె
ట్టివిశేషమ్ములు గల్గునో? వెదఁగుబోటీ! యింత వంతేటికిన్.

ఉ. వచ్చినవాఁటుఁగోలె నిటు వామవిలోచన? యొక్కనాఁడునున్
ముచ్చట దక్కి యుండ వరమో మయి యీఁగనియంతవంతలోఁ
జొచ్చినదానిఁ బోలె నెటు చూచిన నొక్కవిధాన నుంటి వే
పొచ్చెము తేనిదాని కిటు పోలునె? నీరజనీలకుంతలా. 7

క. చెప్పు మది యెట్టిదైనన్, దప్పక తీర్తు ననుఁ దిరుణి తడవికొనుచుఁ దాఁ
జెప్పఁదగిన దొం డుండమి, నప్పటికిన్ బొసఁగుహేతు వది కల్పించెన్. 8

క. కల్పించి మిగుల నేర్పుఁ, జల్పనశక్తియును గల్గుసఖి గానఁ దగన్
బొల్పి యది యక్కతమున ద్విగుణ్యాపినఁ జదివెఁ బోలెఁ గోమలి పలుకన్. 9

ఉ. మాటల కేమి లోపమగు? మానసవైఖరి మాఱెఁ గానిచో
నేటికి దాఁచి పెట్టితిరి? యేఁ గనకుండఁగ నిన్న జా, బిదే
నాఁటను జూడ లే దొకట నాకును మీకు రహస్య మున్నదే?
చాటొనరింపఁగాఁ దగిన సంగతి నా కడఁగంగ నేటికిన్? 10

క. మిము నమ్మి కాదె? నామ, ట్టనులకు దవ్వైతి నెతకుక్కరులా? కటా!
క్రమముగ నను జేలోక టగు, క్రమమునఁ జూ చెదరు తప్పగలిగెనె? చెప్పుఁడీ. 11

క. మీయాజ్ఞ మీఱితినో? మీ, కాయాసకరమ్ము లైనయాయాకోర్కుల్
పాయక కోరితినో? న, న్నీయెడ సుఁ జూడ నేల? యే లాతినోకో? 12

ఆ. వె. మొదలనుండి నన్ను నెద నిట్లు భావింతు, రేని యింత చింత పూనకుందుఁ
బూవు లమ్మబోటఁ బుడక లేగతి నమ్మ, దాన? మీ రెఱుఁగని ధర్మమున్నె? 13

క. ఇఁక మిమ్ముఁ గొల్చునేహితు, లకటా! నను గారవింతురా? వినరే? నా
యకుఁ డొకటి గొట్టినను మా, ఘుకరపువాఁ డొకటి గొట్ట దొరఁకొనకున్నే? 14

ఉ. పేఁమి దప్పచో నిచటఁ బొండెలు వట్టుక పేల నేల? యిల్
చేయుదువా? యటన్న మది చెల్లను పంజరమందుఁ గొన్ని నా
ళ్కీరము దా వసించి పయి లేచి చనంగ స్వజాతి దానిపైఁ
గారము నూఱుఁగాని తగు గారవమున్ బచరించి యేలునే? 15

క. కోలమునకున్ వెలి యయితిన్, బలవంకపుబ్రాహ్మణార్థవైఖరి మీకున్
జులుక నగుదాన నైతిన్. దలవ్రాఁతకుఁ జింతసేయఁ దగదే? నాకున్. 16

క. అని బుడిబుడిదుఃఖమ్మునఁ, గనుఁగవ నశ్రువులు దొఱఁగఁగా గద్గదని
స్వన మొలయ మాట లాడఁగ, ననువుపడనివిధము దోఁప నది విరమింపన్. 17

చ. “ఇది యొక హేతు వౌనె చెలి? యింతటివంతను, దాన నేమి యౌ
న్నది? యడఁగంగ నేల? కనినంతన యేమనువాఁడ? జూడు మ
య్యది యటఁ బెట్టియున్న” దని యాతఁడు తెచ్చి యొసంగునంత న
మ్మదిత పఠింప దించుకయు మో మటు త్రిప్పదు వ్యాజమూర్తియై. 18

క. దాని కతఁ డెంతయేనియు, లో నొగిలి తదంగనాతిలోలుం డగుటన్
“మానిని? విను వినిచెద నీ, నా నేరము సైఁప” మనుచు నారంభించెన్. 19

క. శ్రీరస్తు చిరంజీవి యౌ, దారుసకున్ దల్లి శోభనావాప్తిగ నా
శీరాదిపూర్వకమ్ముగ, మీటిన ప్రేమమున వ్రాయుమే లే మనినన్? 20

మ. కనువా రెవ్వరో? నీ వెఱుంగవు నినుం గన్నట్టులే పెంచి పె
ద్దను గాఁ జేసి గృహస్థుగా సలిపి సంతానార్థ్యుఁగాఁ జూడకే
చనె మీతండ్రి, యభాగ్యురాల నగుటం జాయాప్రజాదూర నిం
కన జీవించితి నేటి కీబ్రతుకు? ప్రాక్కర్మమ్ము నిందార్హమే! 21

క. కడచినదానిని పొరిపుఁ, దడవిన లాభమ్ము గలదె? దారను నీకుం
బడదయ్యెఁ బురాకృత మి, య్యెడ దానెట్లుండె దాని కెవ్వరు కర్తల్. 22

క. "ధనమును పెచ్చించితి" నని, మనమున దిగులొందఁ గలరె? మనుజులు దీనిం
దినఁగ, మనమూఁడుపొట్టలు, చనకుండునె? చాలఁ జిరుగఁ జదరయుఁగాదే? 23

క. చెప్పితిఁ జెప్పించితి నీ, యొప్పమియును దెలిసికొంటి నూఱటగన లే
కిప్పు డిఁక నొకటి వ్రాసెద, నప్పా! యిద్దానికైన ననుమతి గొనుమా?. 24

ఆ. వె. వయసు కొద్ది యైనవాఁడవు గాన నీ, కిష్ట మైనకన్నె నేటి తెచ్చి
కొనుము పెండ్లి చేసి ధనమెల్ల మీ కిచ్చి, సంతసించు మేను సతియుఁ గాంచి. 25

గీ. ఇంక నొకమాట భార్యయుం దిష్టమించు, కయుఁ లేదేని యీపెండ్లి గాని సుఖసు
ఖాల మేమిట్టు లొప్పుటగాదనుమ్ము, గేస్తువగు టెక్కఁరణి నైనఁ గీర్తికరము. 26

క. నీయిష్ట మెట్టులేని స, తీయుతుఁడవు గమ్ము నీకుఁ దీపి గలుగు నా
రోయువిధ యెట్టిదా? యది, పాయనిదే మేము చెప్పఁజాలము యచటన్. 27

క. అని వినిపించిన విని యు, వ్వనజాక్షియు నతనిఁ జూచి "వసునుం గొమరుం
గొనములు గలగతి నుండఁగఁ, జను నే? నీ కిట్లు మమ్ముఁ జక్కన్ బెట్టన్. 28

తే. గీ. నీవు బాగుగ నే యుందు నింద నాది, యొందు కీఱవ్వ? నీకు నే నెప్పుడేని
"భార్య వదలు" మటంచుఁ జెప్పుమగదా? వి, వేకవంతు లెఱుంగని విధులు కలవె 29

క. అని తనమనమునఁ గలవిను, వున నొయిచ్చకము కాని పొంతి తగుగతిం
దనకుం బోధించిన న్యాతనిమనమును గొంతకొంత దారం మరగన్. 30

తే. గీ. ఉత్తరమ్మును వినిచిన యువతి దానఁ, గొంత శాంతించి యట్టుల కుటిలుఁడతఁడు
తలఁచె నాజలజాక్షి యట్టులనె యభినయించె మది నున్న తెఱఁగది యెటుకుఁబోవు. 31

క. ఆగతిఁ గొన్ని దినమ్ములు, నే గుటయును నప్పుడేని యింతిమనము దా
బాగుపడదయ్యె దానివి, రాగపుగతి గాంచి దాఁ గరము శంకితుఁడై. 32

ఆ. వె. ఒద్ద నుండువారి నొక్కొక్కరిని నల్లనల్ల నడుగుటయును నంద లెఱిఁగి
యున్నవార లైన నూరకయుండిరె, వ్వానికి వలయు నిట్టిపాడు గొడవ. 33

"రమణుఁడు తన్నుఁ జూచుటకు రాకెటు తక్కెనొ?" యంచుఁ గేళిస
ద్మము విడి వచ్చె నచ్చెలి యమాత్యుఁడు చింతిలుచున్న చోటికిన్. 43

ఉ. వచ్చెనుగాని రాత్రి యొకవైఖరి స్వప్నము గాంచి యుంటచే
నచ్చపలాక్షి యందుఁ గలయాత్మస్మృతిన్ దలపోసి "నీక్రమా
లెచ్చటఁ గాని లేమియు విధి యెట్లొ రచించెనొ" యంచు సంశయం
బిచ్చఁ జరింప నగ్రముననే యొక భంగిని నిల్చె నిత్తఱిన్. 44

చ. నిలిచినయంత నచ్చెలికి నేత్రము గాఁ జల్లియుంచె దానికిం
దలరక దక్షిణంపునయనంబగుటన్ మటికొంత సందియం
బొలయఁగ "నారకే యిటుల నుండుటయున్ గల" దంచు దాని లో
దులుపుచు లేనిలోన మతిలోయ్యలి దాల్చుచు నట్టె యుండెఁగన్. 45

ఉ. ఎవ్వఁడు దేనిగాలి యొకయించుక సోఁకినఁ ద్రుళ్లిపడు నిం
కెవ్వఁడు ద్వేషరాగ కృతు రేగి యెదన్ దమిఁ గౌఁగిలించు నిం
కెవ్వఁడు భారమం చెఱుఁగ కెప్పటి కంకమునందు నిల్పు వాఁ
డెవ్వఁ డలాఁడి వచ్చుట ను మాత్మ దలంపఁ డుదారుఁ డసహ్యపడన్. 46

క. ఆఁడు నిలుకడం బడి చింతాజటిల మ్మగునతని చిత్తసరణిన్ గల దే
మిట్టి యొకొ? యిటు లింతట్టిలో, మటుమటు యాత్రనికిఁ గల్గు మర్మ మదేమో? 47

క. స్వామికుఁడు తంపి పెట్టెనొ?, బాలకుఁ డతఁ డేటి కట్టి పని యొనరించున్
గూళ తెవరేని వనిక, నీల యిడి వధింపఁ జేసి రేమో? మరలన్. 48

ఉ. ఏ నొనరించు చేష్ట యది యాచినవాఁ డొకరుండె కాక యీ
వానరసేవ కెల్లయుఁగ వచ్చె? నెఱుంగక యేమి కిల్లి దా
గానని కన్నులన్ భయముఁ గప్పు నొందుచుఁ బాలు దాల్చ నే
గ్గానరె? కొంపఁ దీయుటకుఁ గాఁ బ్రయతించిరొ యేమొ? యీసునన్. 49

చ. ఎటు దొరకున్? ధరాంగనకు నిట్టికొలమ్ము వయస్సు రూపమ
క్కటికము పేర్మి గూర్మి గల కాముకుఁ, డేట్టికిఁ బోతి? వానిలోఁ
గుటిలుఁడు వానికైత యది గొంతుక కోసె, దరిద్రుఁ డేత్రికి
న్నటి కరుడెంచెఁ గూళవిధి చెయ్దము లెవ్వరి నెట్లు సేయునే? 50

ఉ. పోయిగఁ బద్దెముల్ చదివినంతట వానికిఁ జిక్కెఁ గాని యీ
కోయనికోఁతి దాఁ దెలిసికో గమకించెనె? పాపబుద్ధి. ఛీ!

ఛీ! యని యూతఁ డింక నెడఁ జేసినఁ "జాలును" నంచు జీవమున్
బోయిక యెట్టులుందు? సరిలేయునిదల్ ననుఁ జూచి నవ్వఁగన్. 51

ఉ. ఎంతటిభాగ్యమే! యనుచు నెంతయదృష్టమొ! యంచు నెంతబల్
వింతలె? యంచు నొకపార లేనితలంపులె యంచు మిక్కుటై
నింతులు కేలు వట్టికొని యెల్లపుడు న్నుతియించు నాదు నీ
వంతయు నిక్కమైనను రవంతయుఁ గూడవు జీవనస్థితుల్. 52

గీ. మఱుగుకాలువజాతిలోఁ బొడముపురుగు, లేదఁ సంసారిజులతోఁ బ్రవలేవ! యిక్క
డిందు నే? నేయి"యని మోము నెదుట నెల్ల, వారు నిందింప బ్రతికిన భాగ్యమేమి. 53

చ. పొదమిఁక నేకాలమ్మునఁ బొందితి మిక్కుటమైనభోగముల్
కడపితిఁ గాల మెల్ల వృథ గాక సుఖమ్ముల కెల్లయై చనన్
బోడిగితిఁ గట్టితిన్ కులముతో యువ్యులెల్ల నెబా సనంగ ని
ట్ట్యొడ నేక నేమిరైన నగు నెంతయు శాశ్వత మీశరీరముల్. 54

ఉ. వినను నాత్మహత్య యది యంత శుభప్రద మంచు నెంచమిన్
నానెఱజాణచెయ్దముల నాయఁడఁ గాఁ డని నమ్మఁ జేసి నా
పై నెవ రిట్లు చెప్పిరో! కృపారహితుల్ కపటాత్ము, లిప్పు డ
క్కాని దురాత్ములన్ విడలఁగా నొనరించెదఁ గాక యం చొగిన్. 55

ఉ. చిత్రము గట్టి చేసికొని చిన్నె లెఱింగిన జాణ గాన లో
న త్తలపాటు లేనిచెలియుం బలె దగ్గఱఁ జేరి వెన్కయై
య త్తఱిఁ గాయఁబోఁడి కను లల్లనఁ జేతుల మూసె నంతలోఁ
ద త్తరమంది "యెవ్వ" రని తక్కుగ కంజసుమాంగమమ్మునన్. 56

క. మెత్త వదలిచి తమ్మను నొత్తిగిలన్ జేసి, చేతు లొక్కింతన దా
నెత్తి వెలిఁ జిమ్మ "సీ!సీ!, తొత్తా! నను ముట్టఁ బోకు తొలఁగు" మటన్నన్. 57

ఆ. వె. డిల్లవోయి తనదు డెందమ్ము పతియాలై, కట్టు దప్పఁ "గలలు కల్ల గావు
కనుసముఁయను గాంచసత్యముల్ నిజ"మని, మనసు మరల ధైర్యమునకుఁ జొనిపి. 58

క. "పరకీయచందమునకున్, జొరబడితిం గాని యెంతసొమ్మునకై క
క్కుఱితిం బడనుగదా! ఔ, తరుణులకున్ లేని విట్టి దళ" లని నగచున్. 59

వ. అని తాఁ బ్రియువాతి యవ్వారిజాక్షి చురచురఁ జూచుచు. 60

ఉ. ఎప్పుడు లేనిరీతి యిది యెట్టిది? యింతటితిట్టు తిట్టి, నే
త ప్పొనరించితిన్?, వెతక దారి యదెల్లను దప్పె నింతలో
నెప్పలుగుల్ మఱేమి వచియించిరి? నవ్వుల కిట్టు లాడుటో?
చప్పుడు గాక యుండ నను సాగఁగఁ ద్రోలు నుపాయమో? కదా. 21

తే. గీ. భార్యఁ బాలింపుమని నిన్ను వచ్చియున్న, యుత్తరమ్మునఁ జిగురున నున్న యట్టి
తల్లిమాటకు బాటింపఁ దలఁచుటొక్కొ? యే నెచట్టికేగుదాన? నిన్నిపుడు విడిచి.

తే. గీ. వయసు దార దోసి వచ్చినయప్పటి, నుండి నిన్నుఁ గొల్చి యొకటనైన
భేద మిత లేనిపెన్మిమెలంగిన, దాన నెటుల నిపుడు తలఁగుదాన? 68

తే గీ. వంటబ్రాహ్మణుతోఁ గాని బట్టలుతుకు, వానితోఁగాని బ్రొత్తువానితోడఁ
గాని లోకమ్ములోపాటుగా నొకింత, కులికితినో యెంతుకింత మీకులికిపాటు?. 64

ఉ. ఇంతకుఁ దప్పు లేనను నిక్కరణిన్ జనునే? తిరస్కృత
స్వాంత నొనర్పు, నొక్కయెడ వచ్చుటయున్ గలుగన్ దొసంగు; ర
త్యంత విచారణల్ వలయు నా? "యదె దున్న యని దూడ పుట్టె" న
న్నంతన "పల్వదె" మ్మనఁగ నౌనె? భవాదృశుఁ డైన మేటికిన్. 65

చ. అని నిలఁబోప రామి నయనాంచలసంచలదశ్రుమాలికల్
పెనఁగొని గద్గదస్వనము పేరి వచస్స్థితి దప్పఁ జేయ నా
తనిపదముల్ శిరమ్మునఁ దాకఁగ నొయ్యన వ్రాలి యేడ్చె న
క్కనకనిభాంగి యాతనికిఁ గంటఁ దడిన్ జనియింపఁ జేయుచున్. 66

క. విరిసెడికోపము పొరిఁబొరిఁ, బురికొనఁగాఁ జేసికొని నపుంసకుఁ గతి ద
త్తరపాటు దక్కియుంచుక, తరలి మరలఁ బల్కె నయ్యహారుఁడు దయతోన్. 67

క. ఎక్కడి నీ వెక్కడినే, నెక్కడినమ్మికలు? వలపు లెక్కడ? కొన్నా
ళ్లక్కఱ పడి తిరిగితి మ్మా,మక్కువ లన్నియును నాఁటిమాటలు చెలియా! 58

క అప్పటినీవును వేఱే, యప్పటియానేను వేఱె యప్పటికాలం
బిప్పుడు రమ్మన వచ్చునె? యిప్పటికిన్ దగినరీతు లిప్పుడు వచ్చున్. 69

ఉ రొక్కము లేక కాదు నిను రోసియుఁ గాదు మఱొక్కలేమకున్
దక్కియుఁ గాదు చెప్పెద యథార్థపుసంగతి చిత్తశాస్త్రిలోఁ
గుక్కలరీతి నొక్కవెలకోమలికై పలుమంది చేరినన్
జిక్కు లనేకముల్ గలుగు ఛీ! యనిపించి విరక్తి చెందితిన్. 71

క. అని యట నిలువక జాలక, చని వేఁటోకొక్కఁడఱుఁ గొంత శాంతించియు న
వ్వనితఁ గుకవిఁ సహితముగనె యిలు వెడలింప నెంచి కఱకువాదమునన్ 72

ఆ. వె. తగినమిత్రు నొకని దగ్గఱఁగాఁ బిల్చి, కార్య మిట్టిదని యనఁగా నతండు
సంశయించి పిదపఁ జాన యున్నెడ కేగి, యిట్టులనియెఁ జిన్న యెలుఁగు దోఁప.

చ. వెలఁదిరో! యుగ్రుఁడై యతఁడు వెల్గుచు నుండెఁ దటాల్న నిద్దియుం
దొలఁగుము లేనిచోఁ గలుగుఁ దొందర లెట్టివియేని యింకఁ బైఁ
బిలువఁగ వచ్చు నీ వపుడు ప్రేమమెసఁగ రాను వచ్చు, నిన్
దలఁచిన నీరు గాఁడె! యిటు తా వృథగా వెడలింప నేటికిన్. 73

క. అని యెన్ని చెప్పినను న, వ్వనిత వినదు దానియెడల భయభక్తులతోఁ
జను నాఁడేమి సేయు? నె! వనిత మగు? దాని నచ్చోటు వాయక జేయన్. 74

క. పదపడి లోఁతుక యగుటన్, గదలించెన్ గుకవి నిల్లు గదలి చనెడియా
త్మదయితు చందమ్మునకున్, మదిఁ దనదిశకన్న వెలఁది మలమల మఱుఁగున్. 75

క. అటు లొక్క రెండు దినములు, కటకట! యని యెల్లరుఁ గలి? యనఁగన
స్పుటకరినోపోషణముల, నటఁ గదలక యతనికరుణకై కాచునెడన్. 76

తే. గీ. కరుణ యొదవియు నాతఁడొక్కలి? యొఱుఁగ, కుంభవిధమున డాఁచి "యి
ట్లొటినింటు, విడుచుపిమ్మటకలసిన డిబికిటుకు, రమ్మనినబుద్ధిగానుండురమణి" యనుచు

క. లోనెంచి దాని నానా, నూనవిభూషణకదంబ మొకటి యుఁ గొన క
మ్మానిని యిలు చేర్పించియు, దానిజనని కిల్లువార్త దా నంపించెన్. 78

క. నీకొమిరె దుర్మదంపుం, బోకిళ్లను నాకు రోఁత పుట్టెఁ "జను" మనఁ
వే కదలదు రెణ్ణాళ్లై, శోకించుచు లంఘనముల నుఱుక్కుచు నుండెన్. 79

తే. గీ. దాసియాస్తి యావత్తు నీదగ్గఱకిపు, డంపితిని నీవు వచ్చి నీయాత్మజాతఁ
దీసికొనిపొమ్ము లేనిచో దీనిని బల, వంతముగ నిల్లు వెడలింప వలసి వచ్చు. 80

క. అనుమాట వినినయంతన, చని తా నవ్వేశ్యమాత జామాతను నే
ర్చినరీతి వేఁడికొని యా, తనిచర్యం గాన కంతఁ దనయన్ గనియున్. 81

క. మెలమెల్లన బోధించియుఁ, జలమున రానొల్లననెడిచానన్ బలిమిన్
వెలికిన్ గొని చనె నదియు, న్వేఁదనయిలు సేరి లోన వగచుచునుండెన్. 82

క. ఇదియంతయు విని "దైవము, బ్రిదికించె న్నన్ను నాదుపట్టయి" యని య
మ్మదిత యలుసొచ్చెఁ గవ్వపుకదు "దదియేమనునో" యనెడిశంక వెనుబడన్. 78

చ. కళవళమందుచున్ వెతలఁ గందుచుఁ గుందుచు నున్నబోటి య
వ్వేల వలపున్ మగండటకు వచ్చినయంతన తేఱిమాఁచి వె
ల్వేల దిగఁద్రావి యాతనిచవిన్ బడి సొల్కఁగ సాగె నద్దిరే!
వెలచెలి కబ్బునవ్విరహవేదన లేఁద నశక్య మెట్లగున్. 83

ఉ. "ఏమిటికై వరించితివొ యివ్విడెఁగుంగవిఁ దీఱఁగాదె! యా
యాముదమెల్ల, నింకయిన నవ్వలి కంపక కొంప కేమటం
చీమయి దూర్చెదే?" యనుచు వృద్ధ వెసన్ దలనోరు మొత్తుకోఁ
గోమలి లెక్కసేయకయ కూటములన్ గరఁగించునక్కవిన్. 84

ఉ. ఆగతి నిర్భయంపుసుఖ మందుచు నాగజయాన లోన సా
నాగతి "నాప్రియుం డిటకు నాకయి రాఁ దనయంత వచ్చె బ
ల్లోఁగినవాఁ డెటుల్ దలఁపులో నను బాయఁ గలండు దుర్మతుల్
వాఁగెడికూఁతలన్ విడుచువాఁడె! యతం" డని యెంచు సారెకున్. 85

చ. అచట సుదారుఁడున్ దరుణికై వగఁ జెందుచు నెప్పుడేనిఁ దా
న చని వెలందిఁ జూచుటకునై మది నెంచియు నట్టులెనవో
"సచివులు భృత్యులున్ మిగులఁ జౌకఁగ నెంతు" రటంచుఁ గొంకు "న
వ్విచికిలగంధిసాటి పదివేలను లే" రని లోనఁ జింతిలున్. 86

క. డోలాయమాన మగుమది, తో లీలలు దక్కి యతఁడు తొయ్యలిఫోటో
లాలోకించుచుఁ గుందుచుఁ, గాలమ్మును గడుపుచుండెఁ గళవళపడుచున్. 87

క. ఆరీతిరొల్లఁ గని "య, వ్వారాంగన యిటకు మరల వచ్చుట తగ దం
చారూఢి నతనిమిత్రులు, వారించెడివలను జూచువా రయి కడఁకన్. 88

తే. గీ. దానియప్పటివర్తనఁ దథ్యముగ నెఱింగి "యిప్పటికేని యాఁవంగులాఁడి
వాని వదలదు నీకు నీవంత యేల?, కావలసెనేనిఁ బట్టియీఁగలము సుము" 89

క. అనుడు "నటులాచరించునె?, వనితకుఁ బొరపాటు మొదల వచ్చెనుగా క
ప్పని బుద్ధికృతము గా" దని, తనమదిలో నున్న తెఱఁగతండు వచింపన్. 90

క. వారును నొకసమయము గని, యారామామణికిఁ గవికి నచుచేరిక క
న్నారంగన్ జూపంగ ను, దారుని రాగాంకురము మొదటికి నశించెన్. 91

క. తనతప్పిదమును దెలియఁడే, కనులారఁగఁ జూచుటయును గాంత యొకవిధం
బున నపుడు బొంకి నమ్మమి, నన రానిదురుక్తులెల్ల ననిపించికొనెన్. 92

చ. పదపడి యింక నాతనికృపన్ గడియించుట దుర్లభం బటం
చెదఁ దలపోసి యాన మొదలే నళియింపఁగ ధైర్యమంతయున్
వదలి "యిఁకేటికి బెట్టుసరి! వైఖరి బొత్తిగఁ దప్పెనంచు న
మ్ముదిత "యుపాయ మిట్టి" దని మాటికి నెంచి కృతప్రయత్నయై 94

మ. తననున్ దానయి యొక్కరేయి యతనిన్ దర్శించి దీనాస్యయై
యనుమాన మ్మొకయింత లేక చరణమ్మందున్ శిరం బుంచి, పే
ర్మి ననున్ వేగ రుణింపఁ దప్పదనుచున్ మే లెంచు మంచున్, వధిం
పనిదయ్యన్ స్ఫురియింపఁ జేసి కరుణన్ బాటింపమన్నంతటన్. 95

ఉ. కుందుచు నింటి కేగి దనకుం గలతెల్వి యదెల్ల దైన్యమున్
జందమునంద చేర్చి యొకజాబిటు వ్రాయఁగఁ బూనె నద్దిరా!
చందనగంధులెట్టిఘనసాహస మైన నొనర్చి బొంకి నా
గుం దమచెయ్వులన్ వెనుకఁ ద్రొక్కఁగఁ జేయుదు రిట్టి కృద్ధునిన్ 96

క. య మ్మార్యా గారికి, నమ్మనమీ దాసి చరణనతముఖియై దం
డమ్ములు సారెకు మ్రొక్కుచు, నిమ్మెయి వ్రాసికొనుమనవు లియ్యవి యయ్యెన్

చ. ఎనిమిదియేండ్లనుండి మిము నేత్రమునన్ బెడఁబాయనైతిఁ గా
దని తమ రూరికిన్ జనినయప్పుడు కాలము లెక్కపెట్టుచున్
దినములు ద్రొచ్చు దాన నిదె దేవునిచెయ్దిని నాలు నాళ్లనుం
డి నెవరు మాలి మీరు కరుణింపమి నీగతి నుంటి నొంటిగన్

క. ఇఁక నుండఁజాల నాచే, యుకుటిలచేష్టలవి యెన్నియో మనమున లె
క్కకుఁ దా మెఱింగి యోజిం, చి కరుణ నిల్పఁ దగు నాదుజీవము తటితోన్

క. పేరేల చెప్పవలె నన్, బ్రేరేపించి రిటు మీకుఁ బ్రియము గలుగు వా
రారయ కాదుర్భోధను, ధీరత్వము గోలుపోయితిన్ జెడితి నిటుల్

క. నాకర్మమ్మునఁ గలపని, యేకారణమైన నేమి! యిటు లొకపరిఁ దాఁ
జేకూరె నిక్క మిది పై, శోకించితి మొదలఁ దెలివి చొప్పడదయ్యెన్. 100

చ. తదుపరి యెంత యేడ్చినను దాఁ "జెయి గాలినమీఁద నాకులన్
బెదకుట, వంటి దయ్యె ననుపిఁటేఁడి గా గణియించి యిట్టిబె
ట్టిద మగువంతయున్ జొనుపుచే యొకయాటగ నెంచి వారు న
న్నదిపానరింపఁ జేసి, రెవరైనను గర్మము దాఁటువారమే? 101

క. ఈగతి నాతల వ్రాసెను, ధాతృవిధి, తలఁపు మిమ్ముఁ దగులమి నోరున్ పై
రాగిల్లి మనఃపూర్వక, భోగము గావింప లేను పారఁ బడి చెడితిన్. 102

ఉ. ఏకాలమందుఁ బుట్టితిను నిన్ని దినమ్ములనుండి మీగృహం
బేకనివాస మాట నిఁక నిప్పుడు పుంగొలపుంగృహమ్మున
న్నాకుఁ బదమ్ము లాగవు ధనమ్మను వద్దు మనమ్ము నద్దు నా
రాఁకను మాత్రి మొప్పుము కరమ్ములు మోడ్చితి నేడ్చితిన్ సఖా.

చ. కడుపున కింత యన్నమును గట్టుకొనంగను బాతచీరలే
నిడుఁ డిది చాలుఁ నాయమృ లెంతకు నీ చెడుమేన నంతు న
క్కఱదనుకన్ భవచ్చరణకంజములన్ గని పెట్టుకుందు నిల్
దుడిచెదఁ బ్రిక్కలన్ బఱతుఁ దొట్టికర్మము నెంచుచున్ బ్రియా.

ఉ. ఇచ్చక మంచు నెంచకుఁ డిఁకెన్నఁడు నన్నును గూడ వద్దు పై
రచ్చను వ్రాసి యిచ్చెదను రాగి దుకాణియుఁ గోరకుండ లో
నచ్చదు నాకుఁ దల్లికిని నాథ! యెటుల్ వసియింతు నింట, నా
ముచ్చ ట్టిదొక్కటే, చిగురుమ ద్దిటు చెల్లఁగఁ జేయు మెమ్మెయిన్. 106

ఉ. మీ రెటు సేయు మన్న నటు మీఱక చేసెదఁ గన్నులార మి
మ్మారయు టొక్కటే వలయు నన్యము గోరను మీదు దాసికీ
చేరిక నిచ్చి పాదములఁ జేర్పుఁడదే పదివేలు దీని నిం
కేరికిఁ జూపకే పనుపుఁ డించుక వార్త, క్షమింపుఁ డన్నియున్. 107

క. ఇచ్చయొ యనిచ్ఛయో మీ, రిచ్చపలన్వాంత కిపుడ యేర్పఱుపవలెన్
బొచ్చెమ్ము వలవ దది మీ, యచ్చరములతోడ వ్రాయు టభ్యర్థింతున్. 108

క. అనివ్రాసియంపుటయు దా, నిని గని యాతండు మనము నీరగుటయు మా
నినిఁ దలఁచి తలఁచి తనలో, ననుకొను నిక్కరణిఁ బ్రేమ వగ్గల మగుడున్

మ. అకటా! యంతటి జాని కిక్కరణి దైన్యం బింత వాటిల్లెనే!
వికలత్వం బకటా! నృపాంగనగతిన్, వేఁదండి సేవించు దా
నికి దాస్యంబుచితంబె! యెంతవగపున్ జిత్తమ్మునన్ లేనిచో
నకి యీనీచత జొప్పనే!, చెలిరో! పశ్చాత్తాప మిట్లున్నదే? 110

క. కానిమ్ము నిన్ను మరలన్, బూనిక మైఁ గొన్న మొగమువొందనె లోకుల్
"ఛీ! యిమ్ము" దనుమ నుమియరే!, నా నేరం బేమి! యివటు నానేమికిరా. 111

# పాణిగృహీత.

ఉ॥ నీటును గోటునున్ దగినసేసపు నొయపు వన్నెచిన్నెలున్
చేటయుఁ దెల్వియున్ గలుగునెయ్యపుఁదొయ్యలు లెందఱేని నీ
పాటికి వెలందు లౌదురె? సెబాసు! బళా! వహవా! వహవ్వ! నీ
మాటలసౌరుతీరు గలమానిని నేను జగానఁ గానఁగా.

చ॥ గళగళ లాడుగాగరలు కంగులు రంగు లెసంగుసైకలున్
హారువుమ ముర్వునం దగుపయంటలు పోడరు లత్తరుల్ విరుల్
గర ములరారుభూషలును గాక వెలందు లటంచుఁ గల్గిరే?
పరిసిరువాక్షి? మీకొలముచానలలో నినుఁ దక్క నొక్కఁడన్. 112

చ॥ అగుదువు సోయగమ్ముగలయట్టివిలాసిని వైన నేమి? నీ
సొగసును జూపుకోపులును సుందరి! వ్యర్థము లంచుఁ జెప్పఁగా
దగు నది యేమనన్ వినుము తన్విరో? యోగ్యత లేనియప్పు డ
మ్మగువను బొందువాఁ డనగ మాలఁడొ? మాదిగవాఁడొ? గాఁదగున్. 114

తే. గీ. ఎంతసౌందర్యముండిన నేమిఫలము? యోగ్యత యొకింతగలుగని యువతిమణికి
నెన్నినగలెట్టివ్రాదయేశు. డెట్టికళుకుఁ లుండినను బొట్టు లేకున్న ముండయనరె?

తే. గీ. నిన్ను నిందించుకన్నను నన్ను నేన నింద యొనరించుటది యుచితంబ మతివ !
గాన నావంటివిశ్వాసహీనుఁ డెందుఁ, గానరాఁడు జగ్మమునఁ గలికిమిన్న.

ఉ. ఎందఱినైనఁ జూచితి నికెందఱినైనను జూడనుంటి నో
సుందరి! నీదుచందమును సొంపును నింపు దలంపు నింపు నే
మందు! నవారవిందవదనా? పద నాయెద నాటఁ బోదు నీ
యం దగునందకానిఁ గయికొందువు నా కయి యందనేట్రికిన్.

క. అని యచ్చెలి తనయెడుటన్, గనుపట్టిన భ్రాంతి దోఁపఁగాఁ బల్కెడియా
తనిచందము గని దూతిక, యను, "నయ్యా! నన్నుఁ బంపరా! యంక్షైనన్". 117

క. దానఁ దెలివొంది "తనయు, జ్ఞానభరం బది యెటెంగెఁ గా!" యని లజ్జన్
లో నొందుచుఁ "జను ముత్తర, మే నీ తే" దని వచింపు మీట్రికిఁ దడయన్,

చ. అన వదియేగ, నంతవట కాజలజాక్షియుఁ "బోయి దూతి రా
దనుకొను లేఖ తెచ్చునొకో? యంచుఁ దపించు "నొసంగకుండునే?"
యని ధృతి గాంచు "నట్టిపుడియాసలె" యంచు నిరాశ నించు "జే
నిని బిని ప్రాణముల్ విడుతు నే" నను కొంచుఁ గణించు ఘుద్దులన్. 119

ఉ. నేర్చియు నేరకో యిటుల నే నొనరించితిఁ దప్పు, దాన బల్
పేర్చినయాగ్రహమ్మె మెయిఁ బ్రేమ యొకింతయు లేక యింత న
న్నేర్చునె! భార్యనే? పడపుటింతిని గానె? యిదెంత దోస మీ
చర్చ యదేల? యాతనికిఁ జచ్చి యశ మ్మొనఁగూర్చు టొప్పదే. 121

క. అని కృతనిశ్చయయై విష,మును సిద్ధము చేసికొని యమోఘవ్యవసా
యనిబద్ధచిత్తయై యుం,డు నెడల్ దతి కేగి యయ్యనుంగుల్ జెలియున్, 122

క. "ప్రిత్యుత్తర మీ లే" దన, నత్యంతామర్షఘూర్ణితాంతరయై "ప్రా
ణత్యాగమె వర మిఁక సం,స్తుత్యనుగుణంపుబ్రతుకు చొప్పడ నేలా?

క. మును వేశ్య లొక్కకొందఱు, తనువుల్ విటుతోడ వీడి తద్దయుఁ గీర్తిన్
గొని రేను విటునియవమతి, కని ప్రాణం బూడ్చి సుచిరయశముల్ గొందున్

క. అని మరల మనము వెనుఁదీ, సినఁ దత్తరపాటు దక్కి చెలి సంక్షేప
మ్మునఁ దనయుద్యమమును నా, తని కీగతి వ్రాసెఁ దెగువ దైవారంగన్.

ఉ. ఇంతకు మున్ను మీకు లిఖియించిన కమ్మప్రకార మేను మీ
చెంత భవత్పదాబ్జములసేవకు నై బ్రదుకన్ దలంతు నో
కాంత! బహూక్తు లేల? యిది కష్టమొ? యిష్టమొ? నేఁటిరాత్రికే
పంతము మాని తెల్పు టది బాగని యెంచి నమస్కరించితిన్. 125

క. అని వ్రాసి మరల నంపినఁ, గనుఁగొని లోలోన నతఁడు కరుణవొడమియున్
వెనువెంటఁ గోపఁ మబ్బఁగఁ, దనలో దా ని ట్లొకింత తల్లడ మందున్. 126

ఉ. చచ్చుట నిక్కమే యగు విశాలవిలోచన, చాక యుండుఁ గా
కిచ్చట కెట్లు రాఁ దగు? నిహీ! యని యెల్లరు నవ్వరే? సరే
యచ్చటులాక్షి యీపయిఁ గులాచరణం బొనరించి కాలముం
బుచ్చుటకన్నఁ జచ్చుటయె పో! కడు మే లగు నెన్నిభంగులన్. 127

వ॥ అని యద్దానిం దలంచుకొని.

ఆ. వె. ఇపుడు చావ నేల? యింతకు మున్న చ,చ్చితివి నీవ కాదు చెలి యుమిన్న
వీఁడు నట్టివాఁడె, ఖేదమ్ము గ్లానే?, మనకు నెన్నఁడేని వనజనయన. 128

ఉ. పుట్టరే? గిట్టరే? జనులు పుట్టిన నే మగుఁ? గిట్ట నేమగున్?
గట్టువవర్తనమ్ము చెడి శాపథవర్తను లైనవారి కే

ప్పట్టున సౌఖ్య ముండ దథవా యొకపట్టునఁ గల్గుఁగాక దా
నిట్టిద యా నిసీ! చెడితి నెమ్మెయి నన్ జెడఁగొట్టి తంగనా.

మ. గృహిణీవర్తనమందు నీవఁ గలరక్తిన్ గాంచి నీహేతువై
"బహుదుశ్శీలము మీకొలమ్ము గుణముం బాటించు" నం చెంచితిన్
మహిళారత్నమ! యన్నియున్ మృష లె నీమాటల్ సెబా? సింతయున్
బహి వెట్టన్ బడి ప్రాణ మూడ్చు మనుచున్ వ్రాసెన్ విధాత్రుం డహో.

ఉ. ఏనను జీవ మూడ్చుకొనుకే ప్రియతింతునో? దాన నేమగున్?
మానిని! యాఁడుదాని కది మన్ననఁ దెచ్చెడునట్లు పూరుషుం
శని నొసంగఁ దెక్కరణి నిన్ విడియుండుదు నేమొగమ్ముతో
నే నినుఁ బూర్వమున్ బలె గణింతు? ఘటింపవు రెంటమున్ జెలీ. 182

క. అని యత్తుదిజాబునకును, దనప్రత్యుత్తరము నిడక తరుణీమణి దూ,
తిని నంపుడు దా నచ్చెలి,విని యాపై నొడలు వీడ విసమున్ మెసవెన్. 183

క. అక్కటతన నత్తలోదరి, మిక్కుటమగు నార్తిగూరి మృతి గనుటయు నీ
వెక్కసపువార్త విని మది,నెక్కుడు చింతించె నాతఁ డిదియొప్పదొకో. 184

చ. అయ్యదిరొట్టిదైన, హృదయంబు సదా తదధీనమౌగతిన్
నెయ్యముమై మెలంగు నలనీటు వెడంగు బోఱుంగు నేఁటి క
త్తొయ్యలి యాత్మ హేతువున దుష్కమెయిన్ మృతిఁజెంద నెంతగా
దయ్యము సేఁతికై వగచి తాళఁగలే కెదఁగుందఁగావలెన్. 185

క. పగవారల మృతికైనను,దగువారలహృదయమునకుఁ దాపము దవులున్
మిగులఁ బ్రియమైన యాసో,యగపుఁగని కతఁడు శోకమందుట తగదే! 186

చ. అరసితిరే? యఁదారు గతి, యక్కట! యెంతయు వచ్చె! దైవమా?
మురిగ యశంబు గంగఁబడెఁ జొక్కపు మేని పసం దడంగె దు
ర్భరమగు పాతకం బొకటి పైఁబడె దుఃఖముతోడి పాటుహో
దురితపుసంత వారసతితోఁ దగునే? తగులాట మేరికిన్. 187

వ. పదపడి యయ్యుద్యారుండును.

ఉ. దానిప్రసక్తి యొల్ల దిగఁద్రావి స్వకీయపురమ్ముఁ జేరి యా
పైని స్వభార్య దాను నొకపాటి గృహస్థుపోల్కె నుండి ర

జ్ఞాన మదెల్లఁ బోయె భవసాగర మెందు నపార మంచు లో
లో నెఱిఁగెన్ మహాత్ముఁడల లోలుఁడు గామియు దానఁ జేసె నిక్. 138

కం. ఆపయి వేశ్య లనినఁ ద్రవ్యవ్యాపృతి గలవార లనిన సత్యాధికానూ
యాపవరతుఁడై చూచు స్వాలోపములన్నియును దలఁచి లో లజ్జించున్. 139

చ. తనభయ మింత లేమిని యదాయద లౌనలయగ్రహారముల్
గనుఁగొని వానిపై ఋణము గల్గుటకున్ మది రోసి వానినె
ల్లను వెసఁ దీర్చి తల్లి తనలక్షణముల్ గని సంతసింప నీ
తిని గనె నెల్లభంగుల సుదీర్ఘయశం బనిశంబు గ్రమ్మఁగన్. 140

గద్య.

ఇది శ్రీకింకవీంద్రఘటాపంచానన విద్వత్కవిబాలకళానిధి
బాలసరస్వతీ శతావధానితిరుపతివేంకటేశ్వరులచే
రచియింపఁబడిన పాణిగృహీతయందు

సర్వమును

షష్ఠాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ.

సంపూర్ణము.



FOR ALL FUELS AT ALL TIMES.

# "CROSSLEY"

## OIL & GAS ENGINES.

Efficient Portable Pumping Sets in all Sizes.

Fitted on all-Steel Trolley.

## AGENTS FOR CIRCARS.

*Messrs.*

**Pyda China Venkatramanna Bros.,**

(Branch:- BEZWADA.) COCANADA.

మావద్ద యెల్లప్పుడు క్రాస్లీ ఆయిల్ యింజనులు అన్నిసైజులు లోను, ఉక్కుట్రాలీమీద బిగించిన పంపింగుసెట్లు అన్నిసైజులలోను, మంచిరకం యమిరీ, సిమెంటు, అన్నిసైజుల పుల్లీలు, హెంపురు బెల్టింగులు, పైపులు, వైరుక్లాత్ బేరింగులు వగైరా మిల్లుసామానులు సరసమైన ధరలకు దొరకును. కలయువారు మాకు వ్రాయ ప్రార్థితులు.

పైడా చిన వెంకట్రామన్న బ్రదర్సు,

బ్రాంచి:- బెజవాడ. కొకినాడ.

# నానా రాజ సందర్శనము.

ఈగ్రంథము పునర్ముద్రణమగుచున్నది. సుమారు అయిదారు మాసములలో విక్రయమునకు సిద్ధమగును. ఇందు బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులు వెనుకటి గద్వాలాది సంస్థానాధీశ్వరులమీఁదఁ జెప్పిన పద్యములేగాక యిటీవల సందర్శించిన రాజులమీఁది పద్యములును, తిలకు మొదలగు దేశభక్తులమీఁద వ్రాసినవియు నితరపద్యములును క్రొత్తగా చేర్చఁబడినవి.

# కలగూరగంప.

చాలకాలముక్రిందనే ముద్రణమునకుఁ బ్రారంభింపఁబడి, పాఠకలోకము ప్రోత్సహించుచున్నను కారణాంతరములచే నిప్పటివఱకును ముద్రింపించుటకు వీలుకలుగలేదు. ఇందు బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరకవుల చాటుపద్యములు, వ్యాసములు, ఉపన్యాసములు, విమర్శనములు, చేర్చఁబడినవి. ఈవిషయములను గ్రంథముయొక్క నామమే తెల్పును. ఇదియును నానారాజసందర్శనములోఁ దుల్యమగునని చెప్పుటకు సందేహము లేదు. పుస్తకములు, మార్చి నెలాఖరునకు విక్రయమునకు సిద్ధమగును

వలయువారు:- బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు, శతావధాని, కడియము, తూర్పుగోదావరిజిల్లా. లేక దివాకర్ల వేంకటావధాని, దిగుమర్తివారివీధి, కాకినాడ. అని వ్రాసినచోఁ బడయఁగలరు.